# చేమకూర కవితావైభవం

చేమకూర వేంకటకవి

కమనీయ పద్యాలకు రమణీయ వ్యాఖ్య

వ్యాఖ్యాత

## డా॥ ఎమ్. కులశేఖరరావు




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

# CHEMAKURA KAVITHA VAIBHAVAM

Selections from Chemakura Venkata Kavi's
Poetic Works with Commentary

By Dr. M. Kulasekhara Rao



యువభారతి

ప్రచురణ: 35.

ప్రథమ ముద్రణ:
2 ఫిబ్రవరి, 1975

ముఖచిత్ర రచన:
శీలా వీర్రాజు

ముద్రణ:
నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ:
విస్డాన్ ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు:

యువభారతి,
౫, కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003.
లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001.

వెల: రూ. 2-00

---

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES

YUVABHARATHI IS GRATEFUL

---



# మా మాట

విలక్షణమైన తమ వ్యక్తిత్వంతో ప్రతిభావ్యుత్పత్తులతో తాము అధిష్ఠించిన వేదికకు అపూర్వశోభను ప్రాముఖ్యాన్ని సంతరించిపెట్టిన మనీషివతంసుల జీవిత విశేషాలతో దిఙ్మాత్రంగానైనా పరిచయం లేకపోతే నూత్న ప్రయోగాలు చేయడానికి ఉద్యమించేవారికి లక్ష్యశుద్ధి ఏర్పడదు. సజీవమైన జాతి తన ఉనికికి తోడ్పడుతున్న మహాత్ములను సమాదరిస్తుంది, సంస్మరించుకొంటుంది. నిర్మాణైక దృక్పథంతో ముందుకు సాగే జాతి కిది అవసరం.

1971 లో మేము నిర్వహించిన కావ్యలహరి ఉపన్యాసమంజరీ కార్యక్రమ సందర్భంగా చేమకూర వేంకటకవి 'విజయవిలాసాన్ని' గూర్చి ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు సమగ్ర పరిశీలనతో రసనిర్భరమైన వ్యాసాన్ని, ఉపన్యాసాన్ని ప్రసాదించారు. చేమకూర వేంకటకవి, మహాకవి. ప్రతి పద్య చమత్కృతికి ప్రసిద్ధి వహించిన విలక్షణ ప్రబంధకర్త. శ్లేషకవితలో శబ్దార్థాలంకార ప్రయోగంలో ప్రత్యేకతను చూపిన చేమకూర కవి కావ్యాలతో పరిచయం తెలుగుభాష అందచందాలతోనే పరిచయం.

డాక్టర్ ఎం. కులశేఖరరావుగారు తెలుగు వచనవాఙ్మయం – పుట్టుకను గూర్చి వికాసాన్నిగూర్చి పరిశోధన చేసి డాక్టరేటు పట్టాని పొందిన పండితులు. ఇంగ్లీషు, ఉర్దూ, సంస్కృత భాషలతో చక్కని పరిచయమున్నవారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో రీడర్‌గా వున్నారు. చేమకూర వేంకటకవి విజయవిలాసము, సారంగధర చరిత్రము నుండి కొన్ని పద్యముల నేటి వారికి సరళమైన వ్యాఖ్యానాన్ని వెలయించి ప్రచురించే అవకాశాన్ని మా కందజేసిన శ్రీ కులశేఖరరావుగారి భాషాభిమానానికి మా కృతజ్ఞతలు,

సహృదయులు యువభారతి నిర్వహిస్తున్న కార్యక్రమాలకు రూపురేఖలు దిద్దడంలోను, వాటిని విజయవంతం చేయడంలోను యథోచితంగా తోడ్పడి తమ ఔదార్యాన్ని సాహిత్యాభిమానాన్ని ప్రకటిస్తారని ఆశిస్తున్నాము.

ఇరివెంటి కృష్ణమూర్తి

2-2-1975

అధ్యక్షుడు



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 35 ప్రచురణలను ప్రచురించి రెండు లక్షల ఇరవై ఐదువేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించటానికి పూనుకొన్నది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో లోగడ దాదాపు ఎనిమిది వేలమంది సభ్యులుగా ఉండేవారు. గత డిశంబర్ 1 నుండి కొత్తరూపు దిద్దుకున్న ఈ ప్రణాళికలో ఇప్పటికి రెండువేలమందికి పైగా సాహితీమిత్రులుగా చేరారు. పాత సాహితీ మిత్రులు కూడా ఈ పథకంలో చేరి, రానున్న ఉగాదినాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్య సాధనలో తోడ్పడండి. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో ఐదువందలకు పైగా భారతీమిత్రులుగా, యాభైమంది భారతీభూషణులుగా చేరారు.

ఉదుత్సాహశక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు. వారి సౌహార్దం, భాషాప్రియత్వం-ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయనశీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని కోరుతూ—

ఇరివెంటి కృష్ణమూర్తి

2-2-1975

అధ్యక్షుడు

# మనవి

క్రీ. శ. పదునేడవ శతాబ్దంలో వెలసిన కావ్యకర్తలలో చేమకూర వేంకటకవి తలమానికం వంటివాడు. ఈయన వ్రాసిన విజయవిలాసం, సారంగధరచరిత్ర అనే రెండు కావ్యాల్లో మొదటిదానికి బహుళ ప్రాచుర్యం, ప్రశస్తి, లభించినవి. సారంగధర చరిత్ర కూడ మంచి కావ్యాల్లో చేరినప్పటికి అనేక కారణాలచేత దానికి రావలసినంత పరిగణన రాలేదని నా అభిప్రాయం.

వేంకటకవి వ్రాసిన కావ్యాలనుండి కొన్ని మంచి పద్యాలు ఎన్నికచేసి వాటికి వివరణ వ్రాయమని యువభారతివారు నన్ను ఆదేశించినారు. విజయవిలాసం వంటి ఉత్తమ కావ్యాలలోనుండి పద్యాలను ఎన్నుకొనడం అంటే చాల కష్టమైన పని. జాతి రత్నాలను ఎదురుగా రాశిపోసి వాటిలోనుంచి పది రత్నాలను గ్రహించమని అంటే, ఎట్లా ఉంటుందో, అవిధంగా అయింది నా పని. ఏ పద్యంలో చూసినా ఏదో చమత్కృతి, ఏదో అలంకారం, ఏదో శబ్దవిన్యాసం. దేన్ని వదలవలెః దేన్ని గ్రహించవలెః అయినా, నా బుద్ధికి తోచినవాటిని గ్రహించి ఇందులో చేర్చినాను.

చేమకూర కవి పద్యాలకే కాదు, ప్రబంధాల్లో ఏ పద్యాలకైనా వివరణ వ్రాయడానికి పూనుకొంటే సంక్షిప్తంగా తెమిలే పనికాదు. ఈ పద్యాలన్నీ నగిషీచేసిన రత్నాంచిన హేమకళాఖండాలవంటివి. వాటి సొగసు చూపించవలెనంటే ఎంతచెప్పినా తక్కువే. అయినా, ఏదో ఒక పరిమితిని దృష్టిలో ఉంచుకొని, ముఖ్యవిషయాలు పోకుండా స్థూలంగా అర్థం తెలిపేవిధంగా వివరణ వ్రాసినాను. కవి ప్రదర్శించిన బహుముఖ ప్రజ్ఞకు ఇది సూచనప్రాయమేకాని, విపులవ్యాఖ్య కాదు. విజయవిలాసంలోని పద్యాలను గ్రహించేటప్పుడు దానిలోని కథాసూత్రం తెగిపోక లీలగా ఇతివృత్తం తెలిసేవిధంగా ఉండేటందుకు ప్రయత్నించినాను.

విజయవిలాసానికి హృదయోల్లాస వ్యాఖ్య వ్రాసిన తాపీ ధర్మారావుగారు అనేక మంచి విషయాలను చెప్పిఉన్నారు. సముచితమైన విషయాలను వారు చెప్పినవాటిని నేను దానిలో చేర్చినాను. వారికి నా కృతజ్ఞత. కొన్ని సందర్భాలలో నేను తాపీవారితో ఏకీభవించలేకపోయితిని. మరికొన్ని చోట్ల వారు చెప్పని విశేషాలు నాకు స్ఫురించినాయి. వాటిని కూడ చేర్చినాను. రసజ్ఞులైన పాఠకులు గ్రహింతురని నా విశ్వాసం. ఏది ఏమైనా; చేమకూర కవితా వైభవాన్ని కొంతలో కొంతైనా ఈ విధంగా ప్రదర్శించడానికి యువభారతివారు పూనుకొన్నందుకు వారిని అభినందిస్తున్నాను.

—ఎం. కులశేఖరరావు

# ప్రస్తావన

దక్షిణాంధ్రయుగంలో వెలసిన ఆంధ్ర ప్రబంధాల్లో విజయవిలాసం మేలుబంతి 'విజయవిలాసం' అనే పేరే అది శృంగారకావ్యమని ధ్వనిస్తున్నది. తెలుగులో విలాస శబ్దంతోకూడుకొన్న కావ్యాలు దివ్యనాయకాలైనప్పుడు లీలామహాత్మ్యాలనే అర్థం కూడా వస్తుంది. 'హరవిలాసం'ఉంది. హరునిలీల అందులో వస్తువు. ఆ మహాదేవుని లీలలన్నీ శృంగార ప్రధానాలుకావు. కరుణారసం కురిపించే ఘట్టాలూ ఉన్నాయి. అయితే దివ్యాదివ్యులూ, ధీరోదాత్తులూ, ధీరలలితులూ నాయకులైన కావ్యాల్లో 'విలాస శబ్దం శృంగార రసప్రధానాలైన కథలకే సామాన్యంగా వర్తిస్తున్నది.

విలాస శబ్దం సామాన్యంగా స్త్రీలపట్ల వాడేది. 'విశేషేన లసనం విలాసః- లస శ్లేషణ క్రీడనయోః- అని గురుబాల ప్రబోధిక. లసధాతువుకు శ్లేషణమనీ, క్రీడనమనీ అర్థాలున్నాయి. అంటే ఆలింగనం రతిక్రీడ విశేషంగా వర్ణించినదాన్ని విలాసం అని అనవచ్చు నన్నమాట. ఇది నాయకునికి అనువర్తింప చేస్తే విజయుడైన అర్జునుడు నాయికాలింగన రతి సౌఖ్యాదులను పొందేకథ విజయవిలాస మౌతుంది. ఈ అర్థం ఈ కావ్యనామానికి చక్కగా అమరుతుంది. విజయవిలాసం సార్థకమైనపేరుతో వెలసిన కావ్యం.

ఈ కావ్యంలో విజయుడు ముగ్గురు కన్యల్ని వివాహం చేసికొని, పుత్రలాభం పొందిన ఘట్టాలు వర్ణింపబడ్డాయి. అంటే నాయకు డొకడు. నాయికలు వరుసగా ముగ్గురు. వారు ఉలూచి, చిత్రాంగద, సుభద్ర. వీరి ముగ్గురు కథల్లో వైవిధ్యం ఉంది. ఆ వైవిధ్యం వారి స్వభావాలను బట్టి ఏర్పడింది. ముగ్గురూ కన్యలే. లజ్జా యౌవనాలు వారి సహజ లక్షణాలు. అయితే వారిలో ఉలూచి ప్రగల్భ. సాహిత్య దర్పణంలో - 'స్మరాంధా గాఢతారుణ్యా సమస్తరతికోవిదా, భావోన్నతాదరవ్రీడా ప్రగల్భాక్రాంతనాయకా' అని లక్షణం చెప్పబడివుంది. ఆమెనే ప్రౌఢ అనిఅంటారు. అర్జునుణ్ణిచూచి స్మరాంధురాలై, సంపూర్ణయౌవనంతో అతని నాకర్షించి, అతనిని మాయతో తన యింటికి గొంపోయి కొంత అల్పలజ్జనే ప్రకటించి, నాయకుణ్ణి తన వాగ్విలాస వైభవంతో వశీకరించుకొన్న ప్రాగల్భ్యాన్ని ప్రకటించిన ఉలూచి ప్రౌఢ. చిత్రాంగద అచ్చమైన ముగ్ధ. తండ్రిచాటు బిడ్డ. ఆమె అందాన్ని చూచి అర్జునుడు మోజుపడి, పెండ్లికి తాపత్రయపడ్డాడే కాని, ఆమె లజ్జకే లజ్జకల్గించే లజ్జావతి. సమధిక లజ్జావతి కావటం ముగ్ధకు ప్రధాన లక్షణం. ముగ్ధ రతివిముఖ. అయినా ఆమెపొందు రసికుల కనంత సౌఖ్యప్రదమని లాక్షణికులు చెప్పారు. కవులు అలాగే చిత్రించారు. విజయవిలాసంలో మాటపలుకులేని సిగ్గులబొమ్మ విజయుని యెద

కెక్కిన కొమ్మ చిత్రాంగద. ఇక సుభద్ర మధ్యానాయిక. సాహిత్య దర్పణంలో 'మధ్యా విచిత్ర సురతా ప్రరూఢస్మరయౌవనా ఈషత్ప్రగల్భవచనా మధ్యమవ్రీడితా మతా' అని మధ్యా లక్షణం ఉంది. విచిత్రమైన మార్గంతో నాథుని పొందు నందు కొన్నదీ, నిండు జవ్వనంతో నాయకుని చిత్తాన్ని హత్తుకున్నదీ, రహస్య వివాహం లోనే కాక రథసారథ్యంలో కూడా తన ఈషత్ప్రాగల్భ్యాన్ని చేతల్లో మాటల్లో ప్రకటిం చిందీ, అయిన సుభద్ర మధ్యానాయిక లక్షణాలతో మనోజ్ఞంగా రాణించింది. విజ యుని చేపట్టిన తర్వాత నవోఢగా నున్న ఆమె ప్రౌఢగా మారిందని కవి చమత్కరిం చాడు. ముగ్ధ ప్రౌఢ కావటానికి కొంతకాలం పడుతుంది. మధ్య క్షణాలమీద ప్రౌఢగా పరిణమిస్తుంది. ప్రౌఢాశృంగారంతో ప్రారంభమైన కావ్యం మధ్యాశృంగా రంతో ముగియటం, ఈ రెంటికి వారధిగా ముగ్ధాశృగారం నిబంధించటం ఇందులోని సంవిధాన శిల్పం.

ఇందులో కథ తక్కువ. వర్ణన ఎక్కువ. ప్రబంధ వర్ణనల్లో ఊహావైభవం గాని, భావనా గాంభీర్యంగాని రచనా సౌందర్యంకాని, కవులు ప్రదర్శించటానికి వీలుంది. ఊహా వైభవానికి రాయలు, భావనా గాంభీర్యానికి పెద్దనాదులు, రచనా సౌందర్యానికి రామరాజ భూషణాదులూ తమ తమ వ్యక్తిత్వాలను ప్రదర్శించారు ప్రబంధయుగంలో. చేమకూర వేంకటకవి రచనా సౌందర్యాన్ని ఆరాధించిన కవి. శబ్దార్థాలంకారాలను సార్థకంగా వాడటం, లసథావులో ఉన్న శ్లేషను తెలుగు పలుకు బడులలో కొత్త సొంపులతో సంతరించటం ఆయన కవిత్వంలో సాధించిన ప్రత్యేక గుణాలు. మాటల వాడుపులో, మాటల విరుపులలో, మాటల కదుపులో చూపించే చమత్కారాలు ప్రతి పద్య ప్రత్యక్షాలు. అందువల్లనే చేమకూరవాని దొక ప్రత్యేక మార్గం అయింది.

విజయుని శృంగారవిలాసం ఇందులో ప్రతిపాద్యాంశం. అది ముగ్గురు నాయి కలనూ, మూడు కథలనూ ఆశ్రయించి ధ్వనింపబడుతోంది. ధ్వని కావ్యాత్మ. ఆధ్వని వ్యంజనావృత్తివలన ప్రతీయమాన మౌతుంది. ఆ వ్యంజనావృత్తి శబ్దశక్తి మూల మనీ, అర్థశక్తి మూలమనీ, ఉభయశక్తి మూలమనీ మూడు విధాలు. అది శబ్దార్థా లకు సంబంధించినంతవరకు. ఈ సూత్రాన్నే శబ్దార్థతుల్యులైన నాయికా నాయకు లకు అన్వయిస్తే ఒక చమత్కారం కలుగుతుంది. శబ్దవృత్తి వంటిదే నాయికామనః ప్రవృత్తి. అర్థవృత్తివంటిదే నాయక చిత్తవృత్తి. శబ్దశక్తి మూలవ్యంజన శబ్దపరి వృత్తిని సహించదు. అర్థశక్తి మూలవ్యంజన శబ్దపరివృత్తిని సహిస్తుంది. ఈ కావ్యంలో నాయికలందరూ వలచింది విజయుణ్ణే. వారి మనోవృత్తిలో వ్యంగ్యమైనది రతిభావం. వారికి సంబంధించినంతవరకు రతి ఏకనాయక నిష్ఠం. అందువల్ల శబ్దశక్తి మూలవ్యంజనాశక్తి నాయికల మనోవృత్తులకు అన్వయిస్తుంది. నాయకుడో మొదట సుభద్రపై వలపుచూపాడు. ఆమెను చూచేలోగా ఇద్దరు కన్యలను వివాహమాడాడు.

నాయకుని చిత్తవృత్తిపట్ల అర్థశక్తి మూలవ్యంజనాశక్తిని అన్వయించవచ్చు. ఆ అర్థ శక్తికి శబ్దంకాదు ప్రధానం-తన స్వార్థం.

నాయికానాయకుల చిత్తవృత్తుల్ని ఇలా అన్వయించుకోవటంలో మరొక చమత్కారం ఉంది. ఉలూచి తనంతట తాను విజయుణ్ణి వలచి వశంచేసుకొన్నది. ఆ ఇతివృత్తం శబ్ద (స్త్రీ) శక్తి మూలవ్యంజనకు చక్కని ఉదాహరణం. చిత్రాంగద తనంతట తాను విజయుణ్ణి కోరలేదు. అర్జునుడే తనపని తాను సాధించుకొన్నాడు. అక్కడ అర్థ (పురుష) శక్తియేగాని శబ్దశక్తి లేదు. అందువల్ల రెండోకథ అర్థశక్తి మూల వ్యంజనకు సమర్థమైన ఉదాహరణం. ఇక సుభద్రార్జునుల వివాహం శబ్దార్థోభయ ప్రధానమైంది. శ్రీకృష్ణమహిమ అందులో పరమ వ్యంగ్యం. ముగ్గురు నాయికలను ప్రతీకలుగా గైకొని ఏదో సాహిత్యసూత్ర రహస్యాన్ని గానీ; తత్వాన్నిగానీ ధ్వనింపచేసే ప్రక్రియ పెద్దనగారే ప్రారంభించారు. దాన్ని యథాశక్తి ప్రబంధకవులు సాధించారు. చేమకూర వేంకటకవి మూడువిధాలైన వ్యంజనావృత్తికి ప్రతీకలైన పాత్రచిత్తవృత్తులను పరమరమణీయంగా చిత్రించి తన ప్రత్యేకత నిలుపుకొన్నాడు :

విజయవిలాస కావ్యరచనావిశేషా లెన్నో మిత్రులు డా॥ కులశేఖరరావుగారు తమ వ్యాఖ్యానంలో చక్కగా చూపించారు. సరళమైన వారి వ్యాఖ్య సహృదయులను సంతోషపెడుతుందని ఆశిస్తున్నాను.

2-2-1975 జి.వి. సుబ్రహ్మణ్యం

# చేమకూర కవితావైభవం

శ్రీ లెల్లప్పు డొసంగ, నీ సకల ధాత్రీచక్రమున్ బాహు పీ
ఠీలగ్నంబుగఁ జేయ, దిగ్విజయ మీన్ డీకొన్నచందాన, నే
వేళన్ సీతయు లక్ష్మణుండుఁ దను సేవింపంగ విల్ పూని, చె
ల్వాలీలన్ దగు రామమూర్తి రఘునాథాధీశ్వరున్ బ్రోవుతన్.

విద్యానగర సభాప్రాంగణాన మంజుల మంజీరధ్వనుల నాట్యమాడి కాలవశాన నిలిచిపోయిన ఆంధ్ర కవితాశారద మరికొంత కాలానికి తంజాపురి విజయభవన సభా సదనంలో అందచందాలతో అవతరించింది. కృష్ణదేవరాయలే తిరిగి రూపుగొన్నాడా అనే రఘునాథ భూపాలుడు, అల్లసాని పెద్దన అచ్చునవచ్చినట్లుండే చేమకూర వేంకట రాజు, భువనవిజయమే పునర్నిర్మితమైనదా అనిపించే విజయభవనం తెలుగుసరస్వతితో బాటు తంజాపురసీమలో తిరిగి సమకూడినాయి. దాని ఫలితంగానే వెలువడింది శృంగారరసప్రధానమై అందమైన అమరకావ్యం విజయవిలాసం.

విజయవిలాస కృతిభర్త రఘునాథరాయలకు ఇష్టదైవం శ్రీరామచంద్రుడు. అంతేకాదు, ఆయన గొప్ప రామభక్తుడుకూడ. ఆ భూపాలుడు నివసించే భవనాల్లోనూ, సాహితీసభలు తీర్చే విజయభవనంలోను శ్రీరామచంద్రుడు సతీపరివార సమేతంగా చిత్రరూపంలో సాక్షాత్కరించి ఉండేవాడట. అటువంటి కృతిభర్త యిష్టదైవమైన శ్రీరాముణ్ని విజయవిలాస కర్త చేమకూర వేంకటకవి తన కావ్యారంభంలో స్తుతిచేసినాడు. ఎల్లప్పుడూ తన సన్నిధిలోనే సీతాలక్ష్మణులు నిలిచియుండగా, రఘునాథ భూపాలునికి భూమండల పరిపాలనమును, అఖండ దిగ్విజయాలను, అనుగ్రహించ డానికి పూనుకొన్నాడన్నట్లు వరదహస్తమును కనబరుస్తూ శ్రీరామమూర్తి, ఈ కృతి భర్తను రక్షించుగాక అని దీని భావము.

కావ్యప్రారంభంలో ఆశీర్వాదంకాని, నమస్కృతికాని, వస్తునిర్దేశం కాని ఉండాలని పూర్వకవి సంప్రదాయం. ఈ పద్యం ఆశీర్వాదరూపంలో ఉన్నది. ప్రథమంలో శ్రీకారం సర్వసంపత్ప్రదం. అందుచేత ఈ పద్యం శ్రీకారంతోనే ప్రారంభమైంది. ఈ విధంగా సాహితీ సంప్రదాయాన్ని పాటించడమేకాక, కవి, కృతిభర్తకు సమస్త సంపదలు కలగాలని ఆకాంక్షించినాడు ఈ ప్రారంభ పద్యంద్వారా.

## 2

రాజున్ భోగియు సౌమ్యుఁడున్ గవియు సర్వజ్ఞుండు నీడౌననన్
దేజఃప్రౌఢవచోవివేకనయభూతిశ్లాఘలన్ మించు; నౌ
రాజున్ భోగియు సౌమ్యుడున్ గవియు సర్వజ్ఞుండు నెబ్బంగులన్
యోజింపన్ రఘునాథభూరమణ వర్యుం డౌ ధరామండలిన్.

దానం చేసినప్పుడు అపాత్రదానం చేయకూడ దంటారు. ఆ విధంగానే అర్హుడు కానివానికి కావ్యాన్ని అంకితం చేయడం సముచితంకాదు రఘునాథ భూపాలుడు అనేక మంచిగుణాలు కలవాడు. కావ్యాన్ని అంకితం తీసికోవడానికి అన్నివిధాల తగిన వాడు. అతని సహజమైన గుణగణాలను చెప్పేదే ఈ పద్యం.

రఘునాథుడు చంద్రునివంటి కాంతిని, సహస్రముఖుడైన ఆదిశేషుని వంటి మాటకారితనాన్ని, బుధుని వంటి వివేకాన్ని, శుక్రాచార్యునివంటి నీతిని, మహేశ్వరుని వంటి ఐశ్వర్యాన్నికలవాడు. అంతేకాదు. చక్కని పరిపాలనా దక్షత, భోగానుభవము, సమరసభావము, ప్రశస్తమైన కవితాగుణము, అపారమైనజ్ఞానము ఈతనికి ఉన్నవి

కృతిభర్తకు ఉండే మంచిగుణాలను, పదింటిని, తెలుపుతూఉన్న దీపద్యం. రాజు, భోగి, బుధుడు, కవి, సర్వజ్ఞుడు, అనే ఉపమానాలు ప్రఖ్యాతమైన వ్యక్తులను తెలిపేవి. పద్యంలోని రెండవభాగంలో, అవే పదాలను తిరిగి ఉపయోగించి, ఈగొప్ప గుణాలన్నీకల ఒకవ్యక్తి రఘునాథుడే అని చెప్పి కవి చమత్కరించినాడు. చంద్రుడు మొదలయిన ఆ అయిదుగురు ఒక్కొక్క గుణానికే ప్రసిద్ధులయితే, రఘునాథభూపాలుడు ఆ ఐదు గుణాలకు ప్రసిద్ధికలవాడని, తన కావ్యానికి కృతిభర్త కావడానికి అన్ని విధాల అర్హుడని వేంకటరాజు భావం.

వేంకటకవికి అభిమాన పాత్రమైన శ్లేషాలంకారం, ఇతర అలంకారాలతో బాటు ఇందులో ఉన్నది.

## 3

తా రసపుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ ననేకకృతుల్ ప్రసన్న గం
భీరగతిన్ రచించి మహి మించినచో నిఁక శక్తు లెవ్వర
య్యా, రఘునాథభూపరసికాగ్రణికిన్ జెవిసోకఁ జెప్పఁగన్.

రాజుగారికి అనంతమైన సంపద, దానికి తగిన కళాపోషణ ఉన్నమాట నిజమే. కాని కావ్యాన్ని గ్రహించడానికి అవి మాత్రమే సరిపోవు. రాజుకూడ స్వయంగా కవి

యైన వాడైతే తాను పొందిన కావ్యంలోని బాగోగులు పరిశీలించి రసగ్రహణానికి అర్హుడవుతాడు. అటువంటి అర్హతలు అన్నీ రఘునాథభూపతికి ఉన్నవని చేమకూర కవి ఈ పద్యంలో వ్యక్తం చేస్తున్నాడు. కవి కృతిభర్తకొరకు వెదకగా తగినవాడు రఘునాథుడే అని అతన్ని ఎన్నుకోవడం అందుచేతనే జరిగింది

ఇక ఆ రాజుగారి కవితా గుణం ఎటువంటిదో చూద్దాం. ఆయన కవిత్వంలో శృంగారాది రసాలను చక్కగా పోషిస్తాడు. ఇదే రసపుష్టి. ఆయన వ్రాసే ప్రతి పదంలో (ఇది శబ్దం కావచ్చు, పద్యం, పాట కావచ్చు). స్వాభావికమై కృత్రిమం కాని వర్ణనలు, కథను నడిపించే నేర్పు, శాబ్దిక విన్యాసంతో కూడిన చమత్కారం, చక్కని అర్థపుష్టి ఉంటాయి. ఆయన కావ్యాల్లో ప్రసాదము అనే కావ్యగుణం ఉంటుంది. గాంభీర్యం ఆయన ప్రకృతిలో వలెనే ఉంటుంది. ఇటువంటి గుణాలు కలిగినకావ్యాలు వ్రాసిన రాజు వినడానికి ఇంపుగా ఉండే కావ్యాలు వ్రాస్తే సమర్థులు ఎవరున్నారు? అని ప్రశ్నిస్తున్నాడు వేంకటరాజు. తాను కావ్యం వ్రాస్తే ఇన్ని గుణగణాలుండాలనీ, అవి ఉంటేనే తప్ప రాజు స్వీకరించడనీ, తాను అంతటి ఉదాత్త కావ్య రచనకు సమర్థుడనీ, కవి ధ్వనిపూర్వకంగా ఈ పద్యంలో సూచించినాడు.

రఘునాథ నాయకుని కవిత్వం గురించి మనకవి చెప్పిన విశేషాలేవి అతిశయోక్తులు కావు. రఘునాథుని రచనల్లో ఈ గుణాలన్నీ ఉన్నాయి. వాల్మీకి చరిత్ర, నలచరిత్ర, రామాయణము, శృంగార సావిత్రి, అచ్యుతాభ్యుదయము, సంగీతసుధ, పారిజాతాపహరణము, గజేంద్రమోక్షము, రుక్మిణీకృష్ణ వివాహము, జానకీ పరిణయము మొదలైనవి ఉన్నవి. వీటిలో యక్షగానాలు, ద్విపదకావ్యాలు, శాస్త్రగ్రంథాలు, ప్రబంధాలు, పురాణాలు అనే భిన్న సాహిత్య ప్రక్రియలు ఉన్నాయి.

## 4

వాసించుఁ గవిత చెప్పిన
వీసరవో వొకట; భక్తివిశ్వాసంబుల్
నీ సొమ్ములు; సామాన్యుఁడ
వే సూర్యవర ప్రసాది విజ్ఞగ మెఱుఁగన్.

ఈ పద్యంలో రఘునాథుడు చేమకూర కవికి, ఆయన కవిత్వానికి, కల గుణాలను ఉట్టంకిస్తున్నాడు. ఆయన కవితో ఇట్లా అన్నాడు : 'నీవు కవిత్వం చెబితే పరిమళించినట్లుగా ఉంటుంది. అంటే అంతట వ్యాపించి అందరికీ ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. ఏ సందర్భం వచ్చినా, ఏ రసాన్ని వర్ణించినా నీవు వెలితి పడడం కాన్పించదు. సామర్థ్యంతో రచిస్తావు. భక్తి విశ్వాసా లనేవి నీ సొమ్ములు. వీటిని రాజులందు ప్రదర్శించడమే కాదు. నీవు తీర్చిన పాత్రల్లోకూడ వీటిని కనబరుస్తావు సూర్యదేవునివరం

వల్ల జన్మించి అసామాన్యుడవైన నీవు అందరికీ తెలిసినవాడవే. నీ గుణాలూ అందరికీ ఎరుక.'

దక్షిణదేశంలో తెలుగు కవిత్వం విస్తరించిన కాలంలో కవిత్వాన్ని పరిమళ వస్తువులతో పోల్చే సంప్రదాయం ఉండేది. పరిమళద్రవ్యాన్ని వాసనచూస్తే ఎంతటి పారవశ్యం కలుగవలెనో, కవిత్వం వింటేకూడ ఆ విధంగా రసికులు ఆనందాన్ని పొందవలెనని నాటివారి ఆదర్శం.

5

ప్రతి పద్యమునందుఁ జమ
త్కృతి గలుగం జెప్పనేర్తు; వెల్లెడఁ బెళుకౌ
కృతి వింటి మపారముగా
క్షితిలో నీ మార్గ మెవరికిన్ రాదుసుమీ.

ఈమాటలు చెప్పిందికూడ రఘునాథుడే. కవితో ఆయన ఈవిధంగా అన్నారు: 'సొగసుగా ఉండే నీ కావ్యాన్ని చాలసార్లు తృప్తి కలిగేటట్లుగా విన్నాము. నీవు వ్రాసే ప్రతిపద్యలోను చమత్కారాన్ని ప్రదర్శిస్తావు. అంటే శబ్దంలోనో, అర్థంలోనో, భావం లోనో చమత్కృతిని పొందుపరిచి కవిత్వం వ్రాయడంలోను, అర్థరసభావ అలంకారాది విషయాలన్నింటిలోను సమర్థుడవు. ఇట్లు చూడగా నేర్పుతోకూడిన ఈ కవితాపద్ధతి ఎవరికీ సాధ్యం కాదు'.

రాజు, కవిని ఇంతటి ప్రశంశ చేసినాడంటే రెండువిషయాలు స్పష్టమవుతాయి. చేమకూరవారి కవితా సౌరభాన్ని రఘునాథుడు పరిపూర్ణంగా ఆస్వాదించినాడు అనేది ఒకటి. అ నాటిరాజులు కవులను ఎంతఘనంగా గౌరవించేదో తెలియరావడం రెండవది.

ఈ రెండుపద్యాలు రాజు చెప్పినట్లు కావ్యంలో కనిపించినా ఈ పద్యాలు వ్రాసిన వాడు కృతికర్త అయన వేంకట కవియే. ఆయన తనకావ్యం ఎట్లా ఉండవలెనో, ఆ కావ్యానికి ఆదర్శాలు ఏమిటో ఈ పద్యాల్లో పొందుపరచినాడు. కవిత్వం పరిమళ భరితంగా ఉండవలె; కావ్యంలోని ప్రతిపద్యంలోను ఏదోఒక చమత్కారం ఉండితీర వలె ఈరెండుఆదర్శాలను చివరిదాకా చేమకూర కవి పాటించినా డనడంలో సందేహం లేనేలేదు.

అభినవ భోజుడైన రఘునాథుడు చేసినట్లుగా ఉన్న యీ ప్రశంస చేమకూర కవికి ఒక ప్రతిజ్ఞవంటిదే అయింది. ఈతని ప్రతిపద్యంలోను చమత్కృతి ఉంటుం దనీ, ఈ కవి కవిత్వపద్ధతి ఇంకొకరికి రాదని, నాటినుండి నేటిదాకా కవులు, పండి తులూ, విమర్శకులు అంగీకరించిన నిత్యసత్యం.

6

చంద్రప్రస్తర సౌధఖేలన పరశ్యామా కుచద్వంద్వ ని
స్తంద్ర ప్రత్యహలిప్త గంధకలనా సంతోషిత ద్యోధునీ
సాంద్రప్రస్ఫుట హాటకాంబురహ చంచచ్చంచరీ కోత్కరం
బింద్రప్రస్థపురంబు భాసిలు రమాహేలాకళావాసమై.

తెలుగు ప్రబంధాలలో పురవర్ణనతో కథాప్రారంభం చేయడం సంప్రదాయం. ఆ సంప్రదాయాన్ని పాటించి, వేంకటకవి ఇంద్రప్రస్థ పురాన్ని వర్ణించే ఈ పద్యంతో కథను ప్రారంభించినాడు.

ఇంద్ర ప్రస్థపురంలో చంద్రకాంత మణులతో నిర్మితమైన సౌధా లున్నవి. అవి ఆకాశాన్ని స్పృశించేటంత ఉన్నతమైనవి. ఆ సౌధాల్లో ఆటపాటలలో ఆసక్తికలిగి, నడియౌవనంలోఉన్న కనకాంగు లున్నారు. వారు ప్రతి దినం చాలశ్రద్ధతో కస్తూరి కుంకుమాది సుగంధ ద్రవ్యముల మిశ్రమ లేపనాలను తమ వక్షోజాలకు అలదుకొం టారు. వా రట్లా చేయడంచేత, ఆకాశగంగలో దట్టంగా పెరిగి చక్కగా వికసించిన బంగారు పద్మాల్లో తిరుగుతూ ఉన్న తుమ్మెదల సమూహాన్ని సంతోషింపచేస్తున్నారు. అంటే ఆ సుందరీమణులు ధరించిన సుగంధ ద్రవ్యాల పరిమళం, వారు నివసించే భవనాలు చాల ఉన్నతంగా ఉండడంచేత, ఆకాశగంగలోని పద్మాలదాకా వ్యాపిస్తున్నా యన్నమాట. అంతేకాదు, ఇటువంటి విలాసిను లున్న ఆ యింద్రప్రస్థపురం లక్ష్మికి, పార్వతికి, సరస్వతికి ఉనికిపట్టయి ప్రకాశిస్తూఉన్నది. సంపదలకు, ఐశ్వర్యానికి, కళ లకు ఆ నగరం ఆటపట్టయిం దన్నమాట.

ఇంద్రప్రస్థపురంలోని చలువరాతి మేడలు (చంద్రకాంతమణుల) తెల్లనివి. అందుచేతనే అవి సౌధాలైనాయి. ఆ మేడల ఉపరిభాగంలో ఆడుకొనే శ్యామల కుచ ద్వంద్వములు బంగారువన్నె కలవి. వారు అలదుకొన్న కస్తూరి లేపనములు నల్లనివి, ఇక—ఆకాశగంగ తెల్లనిది. అందులో ఉండే పద్మాలు బంగారు వర్ణము కలిగినవి. వాటి సువాసనకు సంతోషించే తుమ్మెదలు నల్లనివి. బహుచమత్కారంగా, భూలోకం లోని ఇంద్రప్రస్థపురానికి, స్వర్గలోకంలోని ఆకాశగంగకూ చక్కని బింబ ప్రతిబింబ భావం రూపొందించినాడు కవి.

దేవతలకు అన్నీ ఉన్నాయి కాని, కస్తూరి లేదని మన కవుల విశ్వాసం. కాబట్టి స్వర్గలోకంలోని ఆకాశగంగలోని పద్మాలలో విహరిస్తూన్న తుమ్మెదలకు, అపురూ పంగా ఉండే 'ప్రత్యహలిప్త గంధకలన' చాలా సంతోషాన్ని వారికి కలిగించింది.

ప్రబంధంలోని కథా ప్రారంభంలో ఉండే పద్యం, కొంత సమాసాఢ్యంగా ఉండడం పరిపాటి. మనుచరిత్రలోని 'వరణాద్వీపవతీ తటాంచలమునన్' అనే

పద్యాన్ని ఉదాహరించవచ్చు. అటువంటిపద్యాల అడుగుజాడల్లోనే ఉన్న దీ పద్యశైలి.

ప్రబంధకర్తలకు ఇష్టమైన అతిశయోక్త్యలంకారం దీనిలో ఉన్నది.

7

అతి వినోదముగాఁగ రతుల మెప్పించు నీ
పచ్చల కడియాల పద్మగంధి
చక్కెరమోవిచ్చి చవులఁ దేలించు నీ
ముత్యాల కమ్మల మోహనాంగి
తృణముగా లోఁజేయు నెంతటి వాని నీ
నీలాల ముంగర నీలవేణి
వేలలేని పొందిక విడివడమెఱయు నీ
కెంపుల బొగడల కీరవాణి

అనుచు దమలోన నెఱజాణతనము మీఱ
వార కాంతామణుల మేలువార్త లెల్లఁ
దెలుపుచును, వెన్నెల బయళ్లఁ గలసి నగుచు
విటులు విహరింతు రప్పురివీథులందు.

ప్రబంధాలలో సుందరీమణులైన వేశ్యలను, వారి విలాసాలను వర్ణించనిదే పుర వర్ణన పరిపూర్ణంగా ఉండదు. ఇంద్రప్రస్థపురంలో ఉండే వారకాంతలు ఈ పద్యంలో వర్ణితమైనారు. ఈ వెలదులను కవి తన వాక్యాల్లో వర్ణిస్తే సొగసుగా ఉండదనికాబోలు వెన్నెల రాత్రులలో, బోగంవారి వీధులలోను, బయళ్ళలోను తిరుగుతూ ఆయా వేశ్యల గురించి తమకు తెలిసిన విషయాలు విటులు ముచ్చటలాడుతూ, ఉండడం ఈ పద్యంలో కవి చెప్పినాడు. వేశ్యలతో ప్రసంగంచేయడానికి, విటులుకాక మరెవ్వరు అర్హులవుతారు?

ఈ సీస పద్యపాదాలలో ఒక్కొక్క విశేషాన్ని ఒక్కొక విటుడు చెప్పినట్లుగా భావిస్తే సముచితంగా ఉంటుంది.

మొదట పద్మగంధి అనే సుందరీమణిని గురించి ఒక విటుడు చెబుతున్నాడు. ఈమె పచ్చలు తాపిన కడియాలు ధరించినది. చాల సంతోషం కలిగేటట్టుగా, రతిక్రీడల్లో ప్రవర్తిస్తుంది. ఈమె పద్మంలాగ వాసిస్తుంది కాబట్టి సార్థకనామధేయం కలిగినట్టిది కూడ.

ఇంకొక మగువ ఉన్నది. ఆమె పేరు మోహనాంగి. ఆమె ముత్యాలతోకూర్చిన కర్ణాభరణాలను ధరిస్తుంది. ఈ వేశ్య తన మధురాతిమధురమైన అధరాన్ని రసికుల

కందిచ్చి శృంగార రససంబంధమైన రుచులతో వారికి పారవశ్యం కలిగిస్తుంది. మోహనమైన శరీరం కలిగింది కాబట్టి ఈమెకు మోహనాంగి అనే పేరు వచ్చి ఉండ వచ్చు. అంటే ఈమె పేరు కూడ ఈమె రూపానికి తగినట్లుగానే ఉన్నది.

నీలవేణి అనే నామధేయం కలిగింది మరొక వారకాంత. ఆమె ఇంద్రనీల మణులు కూర్చిన ముక్కర అనే ఆభరణం ధరిస్తుంది. ఆమె గుణం ఏమిటీ అంటే, ఎంతటి మనస్థైర్యము, నిష్ఠ, ఉన్న పురుషునినైనా అతి తేలికగా, గడ్డిపరకలాగ, తనకు లోబరచుకొంటుంది. నల్లగా అందంగా ఉండే జడ కలగడంచేత ఈ కాంతకు నీలవేణి అనే ఉచితమైన పేరు ఏర్పడి ఉండవచ్చు.

కెంపులు అనే రత్నాలు తాపిన కర్ణభూషణాలను ధరించిన వేశ్యాతిలకం మరొ కర్తె ఉన్నది. ఆమె పేరు కీరవాణి. తన పొందికలలో ఆ నారీమణి చూపే నేర్పు, సామర్థ్యం అనే వాటికి వెలకట్టడం అసాధ్యం. ఆమె చూపే నేర్పుకు ఎంత అమూల్యమైన విలువ చెల్లించినా తక్కువే. బహుశా ఈమె ఇంపుగా, మధురంగా, చిలుకలాగ మాటాడుతుంది కాబోలు, ఈమెకు కీరవాణి అనే పేరు వచ్చింది.

ఈ ప్రకారంగా వేశ్యలతో స్నేహంచేసే విటులు, వారిలో వారు, తమ రసిక త్వాన్ని ప్రకటించుకొంటూ, చమత్కారంగా ఉండే మాటలతో, ఆ నగరంలో ఉండే వెలదుల అధిక్యాన్ని గురించి పరస్పరం తెలియచేసికొంటూ, ఇంద్రప్రస్థపుర వేశ్యా వీథుల్లోనూ, నిండువెన్నెల లున్న ఆరు బయటప్రదేశాల్లోనూ, కలిసి విహరిస్తూఉంటారు.

ఈ పద్యంలో పచ్చలు అనేక రత్నాలను గురించి వచ్చినప్పుడు తత్సంబంధ మైన 'రతులు', ముత్యాల ప్రసంగం వచ్చినప్పుడు 'చౌలు', నీలమును గురించి చెప్పి నప్పుడు 'తృణము', కెంపుల ప్రశంస తెచ్చినప్పుడు 'పొందిక' అనే వాటిని బహుచమ త్కారంగా కవి ప్రస్తావించినాడు. రతులు (రతి), 'చౌలు' అనేవి తూకమునకు సంబంధించిన పదాలు. ఉత్తమమైన ఇంద్రనీలము తృణగ్రాహి అని వాడుక. కెంపులను చక్కగా 'పొందిక' చేస్తేనే వాటి సౌందర్యం వెల్లడి అవుతుంది.

## 8

ఆపుర మేలు 'మేలు బళి' యంచుఁ బ్రజల్ జయవెట్టుచుండ, నా
జ్ఞా పరిపాలన వ్రతుఁడు, శాంతి దయాభరణుండు, సత్య భా
షా పరతత్త్వ కోవిదుఁడు, సాధు జనాదరణుండు, దాన వి
ద్యా పరతంత్ర మానసుఁడు ధర్మతనూజుఁ డుదగ్రతేజుఁడై.

పట్టణాన్ని వర్ణించిన తరువాత, పాలకుణ్ని గురించి చెప్పవలెకదా. అందుచేత ఆ నగరాన్ని పాలిస్తున్న ధర్మరాజును, ఆయన గుణగణాలను వెల్లడిస్తున్నాడు కవి.

ధర్మరాజు ఆ పట్టణమును (ఇంద్రప్రస్థపురమును) పాలిస్తున్నాడు. ఆయన చేసే ఆజ్ఞలప్రకారము తానుకూడ ప్రవర్తించవలెనన్న దీక్ష కలవాడు. శాంతి, దయ అనే గుణాలను భూషణంగా కలిగినవాడు. నిజము పలుకడంలో ఉన్న ఉత్కృష్టమైన రహస్యాన్ని చక్కగా తెలిసికొన్నవాడు. మంచివారిని, పండితులను ఆదరించిపోషించే వాడు. ఆయనకు దానవిద్య అంటే చాల యిష్టం. దానియందు ఆసక్తి కలిగినవాడు. స్వయంగా క్షత్రియుడు కాబట్టి తీక్షణమైన పరాక్రమమున్ను కలిగినవాడు. ఇటువంటి మహానుభావుడు రాజ్యపాలనం చేస్తూఉంటే, ఆయన పాలనంలో ఉన్న ప్రజలు 'మేలు బళి' అని మెచ్చుకొంటూ ఉండేవారు. అయనకు జేజేలు కొట్టేవారు.

లోకంలో రాజులకు ఒకలోపం ఉంటుంది. తాము ఆజ్ఞలను జారీ చేస్తారేకాని, అవి తమకుకూడ వర్తిస్తాయని భావించరు. వాటిని తాము పాటించరు. కాని ధర్మరాజు అటువంటివాడు కాడు. తన ఆజ్ఞలను, ప్రజలతోపాటు తానుకూడా పాటించినవాడు అనే విషయాన్ని వెంకటకవి "ఆజ్ఞా పరిపాలనవ్రతుడు" అనే మాటలో పొందు పరచినాడు.

## 9

అతని నుతింపశక్యమె! జయంతుని తమ్ముడు సోయగంబునన్
బతగకులాధిపధ్వజుని ప్రాణసఖుండు కృపారసమ్మునన్
క్షితిధర కన్యకాధిపతికిన్ బ్రతిజోదు సమిజ్జయంబునం
దతని కతండె సాటి చతురబ్ధిపరీత మహీతలంబునన్.

ఈ పద్యంలో కవి, విజయవిలాస కావ్యానికి కథానాయకుడైన అర్జునుణ్ణి పరిచయం చేస్తున్నాడు. నాయకుడు ఎంత ఉదాత్తంగా ఉండవలెనో ఆ విధంగానే ఉన్నాడీ అర్జునుడు.

పాండవ మధ్యముడైన అర్జునుని అందమును గురించి ముందు చెబుతున్నాడు. అతడు అందంలో జయంతుని తమ్ముడు. అంటే అతనితో సమానుడు. జయంతుని ముందుచెప్పి తరువాత అర్జునునే చెప్పవలెనని దీనిభావం. నిజానికి జయంతునికీ అర్జు నునికీ అన్నదమ్ముల వరుస ఉన్నది. ఇద్దరూ ఇంద్రుని కుమారులేకదా!

అర్జునుని రెండవ గుణము దయారసం. దానిలో పక్షీంద్రుడైన గరుత్మంతుణ్ణి ధ్వజంగా కలిగిన విష్ణుస్వరూపుడైన శ్రీకృష్ణునికి ప్రాణస్నేహితుడు. అంటే అతనికి సాటియైనవాడు. యథార్థానికికూడ అంతే. కృష్ణార్జునుల కున్న పరస్పర స్నేహ సంబంధాన్ని గురించి వేరుగా చెప్పనవసరం లేదు.

వీరుడైన అర్జునుడు యుద్ధములను జయించడంలో ఎంతటి ప్రజ్ఞ కలవాడో తరువాత చెబుతున్నాడు కవి. పార్వతీదేవి భర్తయైన ఈశ్వరునికి పోటీ నిలిచేటంతటి వీరుడు అర్జునుడు. ఇదికూడ సత్యమే. శివుడు కిరాతవేషంలో ఉండగా, అతన్ని జయించి అర్జునుడు పాశుపతాస్త్రాన్ని సంపాదించినాడు.

ఈ విధంగా చూస్తే నాలుగు సముద్రములచేత ఆవరింపబడిన ఈ భూలోకంలో అర్జునుని అందానికి, దయాగుణానికి, యుద్ధంలో చూపించే శౌర్యానికి అతని కతడే సాటి. అతనిని నుతించుట సాధ్యమే కాదు.

ఉపమానం చెప్పవలసివచ్చినప్పుడు, వాడి తమ్ముడు వీడు, వీడి నేస్తం వాడు, అని చెప్పడం లోకంలో పరిపాటి. ఆ మాటలను ఈ పద్యంలో చాలచక్కగా ఉపయోగించుకొన్నాడు కవి.

పురుషులలో అందానికి ప్రసిద్ధి పొందినవాడు ఇంద్రుని కుమారుడైన జయంతుడు. కృపారసమునకు ముల్లోకాల్లో ప్రసిద్ధి పొందినవాడు విష్ణుమూర్తి. పరాక్రమానికిని, యుద్ధములను జయించడంలోను, శివుడు ప్రఖ్యాతిని పొందినాడు. ఈ మూడు గుణాలను అర్జునునిలో చెప్పేటప్పుడు కవి ఈ ప్రఖ్యాతమైన వారిని ఉపమానాలుగా గ్రహించినాడు.

ఇన్ని గొప్పగుణాలు-అంటే అందము, దయాగుణం, పరాక్రమము కలిగినవాడు కథానాయకుడు కావడానికి అర్హుడు అని కవి భావం.

ఈ కవికి అభిమానపాత్రమైన శ్లేషాలంకార మున్న దీ పద్యంలో.

## 10

ప్రాయపుఁడెక్కునన్ జెలువపల్కులు చిల్కల గారవించుఁ గం
దోయి చకోరపాళి దయతోఁ బెనుచుం, జనుకట్టు మచ్చికల్
సేయు సదారథాంగ యుగళిన్, నడ లంచల బుజ్జగించు; నౌ,
నేయెడ నింపుగావు గణియింప నవీన వయోవిలాసముల్.

నాయకుని సర్వగుణ సంపూర్ణునిగా ప్రవేశపెట్టిన తరువాత, నాయికను గురించి చెప్పవలె కదా. ఈ పద్యంలో నాయికా వర్ణనం ఉన్నది. ఆమె సుభద్రాదేవి. ఆమె నిండు యౌవనంలో ఉన్నది. ఆ యౌవనంతో ఆమెకు ఒక వింతసౌందర్యం సమకూడింది. అందుచేత ఆమె మాటాడితే చిలుకలను అభిమానించినట్లుగా ఉంటుంది. అంటే అంత తీయగా ఉంటుందని భావం. ఇంక, ఆమె కన్నులు చాల అందమయినవి. చకోర పక్షులను పెంచి తనకళ్లగా చేసికొన్నదా అనిపిస్తుంది ఆ కళ్లను చూస్తే. నిజానికి అవి

చకోరపక్షుల అందాన్ని సంతరించుకొన్నవన్నమాట. ఆ సుందరి స్తనసౌభాగ్యాన్ని ఏమని చెప్పవలె. గుండ్రని స్వరూపం కలిగి, అందంగా ఉండే చక్రవాక పక్షులను మచ్చికచేసి ఎల్లప్పుడు తన దగ్గరనే ఉంచుకొన్నదా అనిపిస్తుంది, ఆ అందమంతా ఆమె వక్షోజాలలో ఉన్నది కాబట్టి. ఇక ఆమె నడక అంటారా ఆ నాయిక నడుస్తూ ఉంటే హంసలను లాలనచేస్తుం దనిపిస్తుంది. హంసలవంటి సుందరమైన నడక ఆమెకు ఉన్నది కాబట్టి. ఈ విశేషాలన్నీ లోకంలో సహజాలే. ఎందుచేతనంటే, ఎలప్రాయంలో ఉండే వారి వినోదాలు ఏవిధంగా చూసినా ఇంపుగానే ఉంటాయి కదా.

మాధుర్యగుణంతో సామ్యం ఉండటం వల్ల స్త్రీల పలుకులను, చిల్కపలుకులతో సామ్యం చెప్పడం, కన్నులను చకోరపక్షులతో పోల్చడం, వక్షోజాలను చక్రవాకాలతో ఉపమించడం, నడకలను హంసనడకలతో సమానంగా చెప్పడం కవి సంప్రదాయం. దాన్ని చక్కగా పాటించినాడు కవి. ఈ ఉపమానాలు చెప్పడంచేత నాయిక అయిన సుభద్ర సౌందర్యాది గుణాలు చక్కగా వ్యక్తమైనాయి. ఇంతటి అందాల రాశి కాబట్టే మన నాయకుడు అర్జునుడు ఆమెను వలచినాడు అని కవి చెబుతున్నాడు.

ఈ సుభద్ర, ఇన్ని గుణాలు కలిగింది కాబట్టి, కీరవాణి, చకోరాక్షి, చక్రస్తని అని సార్థకంగా కూడ పేర్కొనవచ్చును. ఈ పద్యంలో అర్థాంతరన్యాసాలంకారం ఉన్నది.

## 11

ఒక భూమీ దివిజుండు చోరహృతధేనూత్తంసుఁడై వేఁడికోం
టకురా ధర్మజు కేళిమందిరము దండంబోయి కోదండ సా
యకముల్ దెచ్చుటఁ బూర్వక్లృప్త సమయ న్యాయాను కూలంబుగా
నొకయేఁ డుర్వి ప్రదక్షిణం బరుగు నుద్యోగంబు వాటిల్లినన్.

ఇదివరకు వచ్చిన పద్యాల్లో వర్ణనఎక్కువ; కథాంశం తక్కువ. ఈ పద్యంలో కేవలం కథనే చెప్పినాడు కవి.

పూర్వం ధర్మరాజాదులైన పాండవులు ఒక నియమం చేసికొన్నారు. వారి భార్య యైన ద్రౌపదీదేవితో ఒకరు ఉన్న సమయంలో తక్కిన నలుగురిలో ఎవరు కాని ఆ పరిసరాలకు వెళ్ళకూడదని ఆ నియమం. ఆ నియమాన్ని అతిక్రమించినవారు ఒక సంవత్సరం భూప్రదక్షిణచేసి రావాలని ప్రాయశ్చిత్తం కూడ నిర్ణయించుకొన్నారు. ఈ నియమం నారదమహర్షి సమక్షంలో ఆయన సలహాప్రకారం జరిగింది.

ఇక ప్రస్తుత కథ : ఒక బ్రాహ్మణుని ఏకైక ధనమైన ఆవును దొంగ లెత్తుకుని పోయినారు. ఆ బ్రాహ్మణుడు పరుగెత్తుకుంటూ వచ్చి అర్జునునియొద్ద మొరపెట్టు

కొన్నాడు. దొంగలను సంహరించి తన గోవును తనకిప్పించమని ప్రార్థించినాడు. అర్జునునికి ఈ కార్యసాధనకు విల్లూ అంబులూ అవసరమైనాయి. వాటిని గ్రహించేటందుకు ధర్మరాజు, ద్రౌపది ఉన్న కేళీగృహంవైపు వెళ్లవలసివచ్చింది. దాని పరిణామంగా వారు చేసికొన్న పూర్వప్రతిజ్ఞ ప్రకారం, అర్జునుడు ఒక ఏడు భూప్రదక్షిణం చేసికొని రావలసిన పని కలిగింది

ఎంతో నిగ్రహం కలిగిన అర్జునుడు ఇటువంటి నియమ భంగం ఎందుకు చేసినాడు అనే సందేహం మనకు కలుగవచ్చు. దానికి రెండు కారణాలున్నాయి. అర్జునుడు సుక్షత్రియుడు కావడం మూలాన ఆర్తత్రాణపరాయణుడు. గోబ్రాహ్మణ రక్షణ సందర్భంలో పూర్వ నియమాన్ని అతిక్రమించి ఉంటాడు అనేది ఒకటి. ఇక, సుభద్రాదేవి సౌందర్యాన్ని గురించి విన్నప్పటినుండి ఆమెపై లగ్నమైన మనస్సుతో పరధ్యానంగా ఉండడం రెండవది. ఈ కారణాలచేత నియమభంగంలో అనౌచిత్యం కన్పించదు.

## 12

పరిణయ మౌటకేఁగు గతిఁ బౌరు లనేకులు వెంటరా శుభో
త్తరముగ నయ్యెడం గదలి తద్దయుఁ దాలిమి మీర ధర్మత
త్పరుఁడయి యందునందు నులుపాలు నృపాలు రొసంగఁగా నిరం
తరమును బుణ్యతీర్థములఁ దానము లాడుచు నేఁగి యవ్వలన్.

నియమభంగం జరిగిన కారణంగా అర్జునుడు తీర్థయాత్రకు బయలుదేరినాడు. అతడు బయలుదేరి వెళ్లుతూఉంటే పెళ్లి చేసుకోవడానికి వెళ్లుతూ ఉన్నాడా అన్నట్లుగా ఉన్నది. ఎందుచేతనంటే, చాలామంది పురజనులు వెంటవస్తున్నారు. స్నేహితుడూ, నర్మసచివుడూ, అయిన విశారదుడు వెంబడించాడు. ఇక బయలుదేరే సమయం కూడ శుభోత్తరంగా ఉన్నది. అంటే, వెంటనే శుభాన్ని కలుగచేసే ముహూర్తంలో ప్రయాణానికి పూనుకొన్నాడు. ఈ విధంగా ఆ అర్జునుడు ఇంద్రప్రస్థపురాన్ని వదలి, ధర్మమునం దాసక్తి కలవాడై, శ్రద్ధతోను, ఓర్పుతోను ప్రయాణం కొనసాగించినాడు. ఆ ప్రయాణ సందర్భంలో ఆయా రాజ్యాల్లో సామంతులైన రాజు లిచ్చిన కానుకలు గ్రహించినాడు. పావనమైన సరస్సుల్లోను, నదుల్లోను విరామం లేకుండా స్నానాలు చేస్తూ తీర్థయాత్ర కొనసాగించినాడు.

నిజానికీ పద్యం కేవలం కథావృత్తాంతాన్ని చెప్పేది. ఎక్కువగా కవితా వస్తువు కలిగింది కాదు. కాని, ప్రతి పద్యంలోను చమత్కృతి చూపించడానికి పూనుకొన్న చేమకూర కవి ఇటువంటి కథనాత్మక పద్యాల్లో కూడ ఏదో ఒక చమత్కారాన్ని పొందుపరుస్తాడు. అసలు అర్జునుడు ప్రాయశ్చిత్తం చేసుకోవడానికి తీర్థయాత్రకు బయలుదేరుతున్నాడు. అతనిమీద జనులకుండే గౌరవాభిమానాలచేత చాలామంది అతనిని

వెంబడించినారు. అంత పరివారంతో శుభసమయంలో బయలుదేరినాడు కాబట్టి ఆ ప్రయాణం ప్రాయశ్చిత్తార్థం వెళ్ళినట్లుగా కాక, పరిణయానికి వెళ్ళినట్లుగా ఉన్నది అని సహజంగా చెప్పినాడు. కాని ఈ అర్థం అంతటితో ముగియలేదు. ఈ యాత్రా సందర్భంలోనే అర్జునుడు ఒకరిని కాదు ముగ్గురిని, అంటే, ఉలూచిని, చిత్రాంగదను, సుభద్రను వివాహం చేసుకోబోతున్నాడు. పద్య ప్రారంభంలో ఉపయోగించిన 'పరిణయమౌటకేగుగతి' అనే మాటలో ఉన్న పరమార్థం ఇదే. కథలో ఒక ముఖ్య ఘట్టంలో ఉన్న దీ పద్యం. ఆ పద్య ప్రారంభంలోనే భవిష్యత్కథా సూచన చమత్కారంగా చేసినాడు కవి.

## 13

తమినిగుడ గుడాకేశుం
డమరనదీ విమలవారి నాడుచునుండన్
యమునానదిఁ గూడిన తో
యము నా నది తనరెఁ దత్కచామేచకమై.

గుడాకేశుడు అనగా అర్జునుడు అనే అర్థాన్ని గ్రహించినాడు పద్యంలో కవి. 'గుడా' అంటే చూపుడువ్రేలి కొనా, బొటనవ్రేలికొనా కలిసినప్పుడు ఏర్పడే వలయము అని అర్థము. తలవెంట్రుకలను పట్టి చూచినప్పుడు, ఆ వలయం నిండుగా ఉండే దట్టమైన జుట్టు కలవాడు గుడాకేశుడు. అర్జునుని జుట్టు అంత దట్టంగా ఉండేది కాబట్టి అతడు గుడాకేశుడు.

తనకు అవ్వయైన గంగానదిని చూడగానే తీర్థయాత్ర చేస్తున్న అర్జునునికి కుతూహలం కలిగింది. అధికమైన ఆసక్తితో, ఆ నదిలోని స్వచ్ఛమైన నీటిలో స్నాన మాడినాడు. అట్లు స్నానమాడుతూ ఉంటే, అతని నల్లని వెంట్రుకలు గంగానది విమలమైన నీటితో కలిసిపోయి ఆ నీరుకూడ నల్లగా మారిపోయింది. అప్పుడు గంగానది యమున అనే నదితో కలిసిన విధంగా, నల్లగాను, తెల్లగాను భాసించింది.

యమునానది నీరు నల్లగా ఉంటుందనీ, గంగానది నీరు తెల్లగా ఉంటుందనీ ప్రసిద్ధి. తెల్లగా ఉండే గంగాజలము అర్జునుని గుడాకేశములవలన మిక్కిలి నల్లగా కన్పడింది. ఆ విధంగా అది నల్లని నీటిని కలిగిన యమునానదితో కూడిందా అన్న భ్రాంతిని కలిగించింది.

చేమకూర వేంకటకవికి ఇష్టమైన శబ్దాలంకారం, యమకమనేది దీనిలో ఉన్నది.

## 14

హిమరశైక శైకతమునందు విహరించు
శైరవేషు వేషు, ఘననిభాంగు
నెనరు దవుల దవులనే చూచి క్రీడిగా
నెఱిఁగి యారా, యారగేందువదన.

అర్జునుడు గంగానది సమీపంలో విడిదిచేసి ఉన్నప్పుడు, నాగలోకంనుంచి భాగీరథిని దర్శించడానికి వచ్చే ఉలూచి అనే నాగకన్యక అర్జునుణ్ణి చూచింది. అతడు మంచుతో తడిసిన ఇసుకబయళ్లలో విహరిస్తూ ఉన్నాడు. కలువలను బాణాలుగా కలిగిన మన్మథునితో సమానమైన సుందరరూపాన్ని గలిగి ఉన్నాడు. నల్లని మేఘమువంటి శరీరకాంతిని పొంది ఉన్నాడు. దూరంగానే అతన్ని దర్శించి, అతనిమీద అనురాగం కలుగగా అతడు అర్జునుడు అని గుర్తించింది ఉలూచి. అనగా, సుందరాకారుడైన ఆ అర్జునుడు ప్రథమదర్శనంలోనే ఉలూచిని ఆకర్షించి, ఆమె అనురాగానికి కారణమైనాడన్నమాట.

ఉలూచి అర్జునుణ్ణి ప్రథమంగా ఇప్పుడు చూచినప్పటికి, ద్రౌపదీ స్వయంవరం జరిగిన నాటినుంచి ఆయననుగురించి ఆమెకు తెలుసు. ఆ స్వయంవరానికి వెళ్లిన నాగకుమారులు అతని సౌందర్యాన్ని ఇదివరకే వర్ణించి చెప్పినారు. ఆ విశేషాలు విన్నది కాబట్టే, అతన్ని చూచినవెంటనే గుర్తించింది. అతనిమీద అనురాగం కలిగింది.

మనుష్యులకంటె, నాగులకు గుర్తించే గుణం ఎక్కువగా ఉంటుంది. అందుకే అర్జునుణ్ణి దూరంగా చూచి గుర్తించడంలో ఉలూచికి సాధ్యమైంది. అలంకారం ఛేకానుప్రాసము.

## 15

గుట్టసియాడ, గబ్బిచనుగుట్టలపైఁ బులకాంకురావళుల్
తెట్టువగట్టఁ, గోరికలు దేటలు వెట్టఁగ, వేడుకల్ మదిన్
దొట్టికొనంగ నచ్చెరువు తొంగలి రెప్పల వ్రీఁగనొత్తఁగాఁ,
బెట్టిన దండ దీయక విభీత మృగేక్షణ చూచె నాతనిన్.

అమితసుందరాకారుడైన అర్జునుని దర్శించగా, అతనిమీద అనురాగం కలిగిన నాగకన్య ఉలూచి స్థితిని ఈ పద్యంలో కవి వర్ణించినాడు.

ఉలూచి అర్జునుని వరించిన సంగతి ఇదివరకు ఎవరికీ తెలియదు. ఆ విషయం రహస్యంగా ఉన్నది. ఈ రహస్యం ఇప్పుడు ప్రకటించడమా మానడమా అని ఆమె మనస్సు సంచలనాన్ని చెందింది. ఇది మానసికస్థితి.

భౌతికంగా కూడ ఆమెలో సంచలనం కలిగింది. ఉన్నతంగా ఉండే ఆమె వక్షోజాలపైన గగుర్పాటు కలిగింది. అనేక కోరికలు, వలపులు కలిగినాయి. వినోదంగా ఉండే అనుభవాలు మనస్సులో ఒకదానివెనుక ఒకటి అల్లాగ నెట్టుకొని వచ్చినాయి ఆమెకు కలిగిన ఆశ్చర్యంవల్ల వాలుగా ఉండే ఆమె కనురెప్పలు వెనుకకు వెళ్లినాయి. అంటే కళ్లు పూర్తిగా విచ్చిచూస్తున్నదన్నమాట. చెక్కిలికి చేయిచేర్చి కదలకుండా ఉండే స్థితిలో, ఆ మోహనాకారుణ్ణి చూస్తూఉన్నది. ఆ పరిస్థితిలో ఆమె విభీత మృగేక్షణలాగ ఉన్నదట.

ఉలూచి అర్జునుని అనుకోకుండా చూడడం సంభవించింది. అతన్ని గుర్తించింది అతనిమీద అనురాగం కలిగింది. అందుచేతనే పులకాంకురంవంటి సాత్త్వీక భావోదయం ఆమెలో కలిగింది. అర్జునుని మోహనాకారాన్ని చూచినప్పుడు ఆమెకు పారవశ్యస్థితి కూడ కలిగింది. అందుకే ఆమె పెట్టిన దండ తీయక ఆ రాజకుమారుని దర్శించింది. ఈ విధంగా ఉలూచిలో కలిగిన మానసిక, భౌతిక సంచలనాన్ని కవి ఈ పద్యంలో వర్ణించి ఉన్నాడు. చేమకూర కవి వ్రాసిన వర్ణనాత్మకమైన పద్యాల్లో ఈ పద్యం ఉచ్చకోటికి చెందింది.

'గుట్టు' అనే పదానికి మర్మస్థానం అని కొందరు వ్యాఖ్యాతలు అర్థం చెప్పి ఉన్నారు. ఆ అర్థంకూడ అసందర్భం కాదు. ఆ విధంగా చెప్పినప్పుడు ఈ పద్యానికి అసభ్యతా దోషం పట్టుకుంటుంది.

## 16

ఊదుక పోవు శంఖము నహో గళరేఖ! శరాసనంబులన్
వాదుకుఁ బట్టుఁ గన్బొమల వైఖరి; వంకలు తేరుచున్ గటా
క్షోదయలీల సాయక సమూహములన్; విషమాస్త్రుఁ గెల్చుచో;
యేదొరసాటి యీనరున కెన్నఁగ వీరవిలాససంపదన్.

ఈ అర్జునుని కంఠంయొక్క సౌందర్యం శంఖాన్ని కూడ మించింది. తీర్చి నట్లుగా ఉండే ఈతని కనుబొమలు ధనుస్సులను కూడ తిరస్కరించేవిగా ఉన్నవి. దయతో కూడిన యీతని దృష్టులు బాణాలను కూడ తిన్నగా చేసేవిగా ఉన్నాయి. అంటే వాటిని నిరాకరించేవిగా ఉన్నవి. ఈతడు మన్మథుని కూడ గెలువగ్గలిన సౌందర్యం కలిగినవాడు. ఈ అర్జునునికిగల వీరత్వంలోను, విలాసంలోను ఏ రాజూ సమానం కాలేడు.

స్థూలంగా భావం ఇదే ఐనా, కవి శబ్దోపయోగంలో చాలా చమత్కరించినాడు. అర్జునుడు మహా వీరుడు. యుద్ధాలుచేసి అనేక వీరుల నిర్జించినవాడు. అందుచేత

అతన్ని చూడగానే, అతని పరాక్రమం గుర్తుకు వస్తుంది. ఆతని కంఠాన్ని చూస్తే ఇతడు శంఖాన్ని అవలీలగా పూరిస్తాడు అనిపిస్తుంది. అతని కనుబొమలు చూస్తే ధనుస్సులను గ్రహించి యుద్ధం చేస్తాడు అని తోస్తుంది కడగంటి చూపుల సొగసును పరిశీలిస్తే, బాణాల వంకలు తీరుస్తాడీతడు అని తెలియవస్తుంది. అందువలన ఎటువంటి క్రూరబాణాలు కలిగిన వీరుణ్ణి అయినా ఇతడు జయించగలడు సుమా అని అనిపించక పోదు. ఈ విధంగా చూస్తే ఈ నరుడైన అర్జునునితో ఏ రాజు సమానం కాగలడు?

శంఖాన్ని కంఠంతోను, ధనుస్సులను కనుబొమలతోను, తూపులను చూపులతోను పోల్చడం కవి సంప్రదాయం. ఆ సంప్రదాయాన్ని ఆ ఉపమానాలను చమత్కారంగా ఉపయోగించి కవి ఈ పద్యానికి మనోహరమైన భావాన్ని సమకూర్చినాడు.

ఉలూచి నాగకన్య. మనుష్యాంగన కాదు. అర్జునుడు మానవుడు. అర్జునుని పేర్కొంటూ, 'ఈ నరుడు' అని ఉలూచి అనడం ఎంతో భావగర్భితంగా ఉన్నది. ఇతడు మానవుడే అయినా, వీరవిలాస సంపదల్లో ఏ లోకంలో నివసించే రాజుకూ తీసిపోడు అని ఆమె భావించింది.

## 17

నువ్వుఁబువ్వు నవ్వు జవ్వని నాసిక
చివురు నవురు జవురు నువిదమోవి
మబ్బునుబ్బుగెబ్బు బిబ్బోకవతివేణి
మెఱపు నొఱపుఁ బఱపుఁ దెఱవమేను.

అర్జునుని అందానికి వశమైన ఉలూచి క్షణకాలంలో అతన్ని నాగలోకానికి తీసుక వచ్చింది. అప్పుడు కండ్లు తెరచిచూస్తే ఒక మనోహరాంగి తన యెదుట ఉన్నది. ఆమె అందాన్ని మననం చేసికొంటున్నాడు అర్జునుడు.

ఆ యౌవనవతి అయిన ఉలూచిముక్కు నువ్వుపువును కూడ పరిహసించేటంత అందంగాను, సుకుమారంగాను ఉన్నది. ఆ జవరాలి అధరము చివురుటాకు సౌకుమార్యాన్ని, ఎఱ్ఱని వర్ణాన్ని దండించేదిగా ఉన్నది. అంటే చివురుటాకుకంటే ఇంపుగా ఉన్నదన్నమాట. ఇక ఆ విలాసవతి సుందరమై నల్లగా ఉండే కొప్పు, నీలమేఘం యొక్క గర్వాన్ని పడద్రోలేదిగా ఉన్నది. ఆ కాంత శరీరము, మెరుపుతీగ కాంతిని కూడ పారద్రోలినట్లుగా ఉన్నది. అంటే, ఉలూచి తనూసౌందర్యం విద్యుల్లతను కూడ మించిందని భావం.

తీర్థయాత్రావ్రతం ఉన్న అర్జునుని ఆకర్షించిన ఆ కాంత ఎంతటి అందం కలిగిందో కవి ఈ పద్యంలో చెప్పినాడు. ఈ సౌందర్యానికి అర్జునుడు ముగ్ధుడు కావ

దంలో ఆశ్చర్యం లేదని, ఉలూచి విలాసాన్ని వర్ణించి కవి సూచనమాత్రంగా వెల్ల డించినాడు.

## 18

కన్నియఁగాని వేఱొకతెఁగాను మనోహరరూప, నీకు నే
జన్నియ వట్టి యుంటి నెల జవ్వన మంతయు నేఁటిదాఁక; నా
కన్నుల యాన, నా వలపు కస్తూరి నామము తోడు; నమ్ము; కా
దన్నను, నీదు మోవి మధురామృతమానియు బాసచేసెదన్.

ఈ పద్యంలో ఉలూచి అర్జునునితో తన మనస్సులో ఉండే కోరికను వెల్లడిస్తూఉన్నది.

ఓ సుందరస్వరూపం కలిగిన అర్జునా! నేను అవివాహితను. నా లేతయౌవ నాన్ని ఈనాటివరకు నీ కొరకు ముడుపుకట్టి ఉన్నాను. ఈ విషయంలో నీకు సందేహం అవసరం లేదు. నా కన్నులతోడు సుమా; నాకు ప్రేమాస్పదమైన కస్తూరి తిలకంపై ఒట్టు. ఇంకా నీకు విశ్వాసం కలుగకపోతే నీ తీయనైన మోవిని స్పృశించి ప్రమాణం చేస్తాను.

ఉలూచి తాను కన్య అనే విషయాన్ని అర్జునునితో విశ్వసింప చేయడానికి ప్రయత్నం చేస్తున్నది. ఏదైనా విషయాన్ని రుజువు చేయడానికి తమకు ఇష్టమైన వస్తువులపై ఒట్టు వేస్తారు. ఇక్కడ ఉలూచి తన సుందరమైన కన్నులపైన, తనకు ప్రియాతిప్రియమైన కస్తూరి తిలకంపైన ఒట్టువేసింది. అంటే తాను నిజం చెప్పకపోతే తన కన్నులు పోతాయని, తనకు బొట్టు దూరం అవుతుందని భావం. ఇంకా విశ్వాసం లేకపోతే తనకు ప్రియమైన అర్జునుని అధరాన్ని స్పృశించి బాసచేస్తానని అంటూ ఉన్నది. ఏదైనా ప్రియమైన వస్తువును స్పృశించి ప్రమాణం చేయడం కూడ సంప్ర దాయమే. ఆవిధంగానైనా ఆమెకు అర్జునుని అధరాన్ని అనే అవకాశం వస్తుందని మనం అనుకొన్నా బాధలేదు.

అమృతం అంటే విషం అని అర్థమనిన్నీ, అవసరం అయితే విషం తాగి ప్రమాణం చేస్తానని ఉలూచి అంటున్నదని తాపీవారు వ్రాసినారు. కాని దీనిలో రెండు బాధకాలున్నాయి. ఒకటి, అర్జునుని మోవిలో విషం ఉండడానికి అవకాశం లేదనేది. రెండవది, సర్పకన్య విషం త్రాగినప్పుడు అది సత్యప్రమాణమైనా, అసత్య ప్రమాణ మైనా ప్రమాదం జరుగదు. విషధరులను విషం ఏంచేస్తుంది? అందుచేత అమృతాన్ని అమృతంగా గ్రహించడమే మంచిది.

## 19

అంకిలెటింగి యూసరసుఁ డంత 'వివాహ విధిజ్ఞుఁడైన మీ
నాంకుఁ డొనర్చినాఁ డిది శుభైకముహూర్తము ర'మ్మటంచు ప
ర్యంకముఁ జేర నెచ్చెలి కరగ్రహణం బొనరించెఁ దన్మణీ
కంకణ కింకిణీగణ వికస్వర సుస్వరముల్ సెలంగగన్.

సరసుడైన అర్జునుడు ఉలూచి అభిప్రాయాన్ని గ్రహించినాడు. 'పెండ్లి పద్ధతులు చక్కగా తెలిసినట్లు మన్మథుడు శుభమునే ప్రధానముగా చేసి ఏర్పాటు చేసిన ముహూర్తమిది ఇక రమ్మ' అని అంటూ అర్జునుడు పాన్పు దగ్గరకు వచ్చేలాగ ప్రేయసి అయిన ఉలూచి చేయిని గ్రహించి పాణిగ్రహణం అనే విధిని నిర్వర్తించినాడు. అప్పుడు ఆమె చేతులకు ధరించిన కంకణములు, కాళ్ళకు ధరించిన మంజీరములు ఇంపుగా ధ్వనించినాయి.

ఈ పద్యంలో ఉలూచికి, అర్జునునికి కలిగిన సమాగమాన్ని వివాహ విధితో పోల్చి చక్కగా వర్ణించినాడు కవి. పాణిగ్రహణం, అంటే వివాహం శుభముహూర్తమున జరుగవలెకదా. ఈ జంటకు వివాహం జరగడానికి, స్త్రీ పురుషులను కూర్చడంలో నేర్పు కలిగినట్టి మదనుడు ఏర్పాటుచేసిన ముహూర్త మిది. అందులోను శుభమును ప్రధానంగా గ్రహించి నిశ్చయించినట్టిది. వివాహ సమయంలో మంగళవాద్యములు మ్రోగవలె. ఈ వివాహంలో వాటికిన్నీ కొదువలేదు. అర్జునుడు ఉలూచి కరగ్రహణంచేసి ఆమెను పర్యంకమున చేర్చినప్పుడు ఆమె ధరించిన కంకణములు, చిరుగజ్జెలు మంజులంగా ధ్వనించినాయి. అవి మంగళవాద్యాలకు సమానమైనవ్వటికీ, ఈ విధంగా ఉత్తమమైన ముహూర్తంలో అర్జునుడు ఉలూచి పాణిగ్రహణం చేసి విధిపూర్వకంగా వివాహం చేసికొన్నాడు కాబట్టి, ఈ వివాహం అన్నివిధాల ఉచితమైనట్టిదే అని కవి భావం.

ఈ పద్యంతో విజయవిలాసంలోని అర్జునుని విలాసాల్లో ఒక విలాసం ముగిసింది.

## 20

చెండ్లా గుబ్బలు ? జాళువా తళుకులా చెక్కిళ్ల డాల్ ? సింగిణీ
విండ్లా కన్బొమ ? లింద్రనీలమణులా వేణీరుచుల్ ! తమ్మి లే
దూండ్లా బాహువు ? లింత చక్కదన మెందుంగాన, మీ జవ్వనిం
బెండ్లాడంగలవాఁడు సేసినది సుమ్మీ భాగ్య మూహింపఁగన్.

ఉలూచిని వివాహం చేసికొనిన తరువాత, ఆమెను నాగలోకంలోనే ఉండ నియమించి కథానాయకుడైన అర్జునుడు తీర్థయాత్ర చేస్తూ మలయధ్వజుడు పరిపాలించే మణిపురం

చేరినాడు. ఆ పట్టణ ప్రాంతంలో ఉండే ఒక ఉద్యానంలో విహరిస్తూన్న చిత్రాంగదను చూచినాడు. ఆమె మలయధ్వజుని కుమార్తె. ఆమె అందచందాలు చూచి ముగ్ధుడైనాడు. ఈ పద్యంలో చిత్రాంగదాదేవి తనూవిలాసాన్ని వర్ణిస్తున్నాడు.

"ఆమె స్తనములు బంతులవలె ఉన్నవి. చెక్కిళ్ల కాంతులు మేలి బంగారు మెరుపుల్లాగ ఉన్నవి. కనుబొమలు సింగిణీ ధనుస్సులతో సమానంగా ఉన్నవి. నల్లని వెండ్రుకలు ఇంద్రనీలమణులతో పోలిఉన్నవి. బాహులతలు తామరతూండ్లకు సమంగా ఉన్నవి. ఇన్ని దేశాలు తిరిగినాను కాని, ఇంత చక్కదనాన్ని ఎచ్చటా చూడనేలేదు. ఈ యౌవనవతిని వివాహమాడకలవాడు ఎంతటి భాగ్యం చేసినవాడో కదా" ఈ విధంగా భావించినాడు అర్జునుడు.

తీర్థయాత్ర చేయవలసిన సంవత్సరం పూర్తి అయింది. కాబట్టి అర్జునుడు ఒక సుందరిని చూచి ఆమెను మోహించడంలో విచిత్రమేమిలేదు. ఇచట ఒక విశేషం ఉన్నది. చిత్రాంగదను అర్జునుడే చూచినాడు కాని, ఆమె ఈ కురువీరుణ్ణి చూచినట్లు లేదు.

## 21

క్షితిపయి వట్టిమ్రాకులుఁ జిగిర్ప వసంతుఁడు దా రసోప గుం
భిత పదవాసనల్ నెఱప, మెచ్చక చంద్రుడు మిన్నునన్ బ్రస
న్నతయును సౌకుమార్యము గనంబడ జాల్గరగంగఁ జేసె; నే
గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా.

ఈ పద్యంలో వసంత ఋతువును, వెన్నెలను వర్ణించినాడు కవి.

భూమిమీద శిశిర ఋతువులో ఆకు రాలిపోవుటచేత మోడులైన చెట్లు చిగిర్చేలాగ వసంతఋతువులో వసంతుడు ఆకులు, పూవులు కలిగించి సువాసనలను విస్తరింపచేసినాడు. కాని, ఈ పనిని మెచ్చక ఆకాశంలో చంద్రుడు, విమలంగాను, సౌకుమార్యంగాను ఉండేటట్లుగా వెన్నెలలను ప్రసరింపచేసినాడు. దాని ప్రభావం వలన చంద్రకాంతమణులు కరిగిపోయినాయి ఏమి చిత్రమో కాని, ఎంత చక్కగా పనిచేసినప్పటికీ, సమకాలంలో ఉండేవారు మెచ్చుకొనరుకదా.

ఈ పద్యంలో మరొక అర్థంకూడ కానవస్తుంది. అది బహుశా చేమకూర వేంకటకవి సమకాలంలో జరిగింది కావచ్చు.

వసంతుడు అనే ఒక కవి ఉన్నాడు. అతడు శృంగారాది రసములతో కూడిన శబ్దాలను, భావాలను తన కవనంలో ప్రకటించినాడు. దానికి వట్టి మ్రాకులవంటి రసజ్ఞత లేనివారుకూడ ఆనందించినారు కాని, చంద్రుడు అనే మరొక కవి ఉన్నాడు

అతడు వసంతుని రసభరితంగా వ్రాసిన కవనాన్ని మెచ్చలేదు. అతడు తన కావ్యంలో ప్రసాదగుణము, సౌకుమార్యము అనే లక్షణాలను చేర్చి రాళ్ళవంటి అరసికులైన పాఠకులను కూడ రంజింపచేసినాడు. ఏ విధంగా వ్రాసినప్పటికి, సమకాలంలో ఉండే కవులు మెచ్చరుకదా!

చేమకూర వేంకటకవి ఈ పద్యాన్ని ఆత్మాశ్రయత్వాన్ని సూచిస్తూ వ్రాసినాడని చెబుతారు. సమకాలంలో ఉన్న కవులు మత్సరగ్రస్తులయి కావ్యాన్ని ఎంతచక్కగా వ్రాసినా ప్రశంసించరుకదా అనే భావాన్ని ఈ పద్యంలో ప్రకటించినాడు.

వసంత ఋతువులోని శోభ అంతా భూమిమీదనే ఉంటుంది. చంద్రుని సొబగు ఆకాశంలోనే ఉంటుంది. అందుచేత ఈ పద్యంలో ఉన్న 'క్షితిపయన్, మిన్నునన్' అనే మాటలు సాభిప్రాయంగా ఉపయోగించినట్టివనే చెప్పవలె. ప్రబంధ కవులకు అభిమానపాత్రమైన అర్థాంతరన్యాసాలంకారం ఉన్న దీ పద్యంలో.

## 22

అపుడు నృపుడు ప్రఫుల్ల నవాంబుజ ప్ర
సన్నముఖుఁడయి మలయధ్వజ క్షితీశ
కమలహితునకు మామకాగమనవార్తఁ
దెలుపు మనుచు విశారదుఁ బిలిచి పనిచె.

చిత్రాంగదను దర్శించినప్పటి నుండి ఆమెమీది వలపుకారణంగా విరహం కలిగింది. ఇంక, ఆ రాత్రి ఎట్లో గడిపి, ప్రభాతసమయంకాగా, కథానాయకుడగు అర్జునుడు బాగుగా వికసించిన కొత్త కమలంలాగ ప్రసన్న ముఖం కలవాడైనాడు. అంటే అతనికి ఉండే విచారం పోయి, ఒక నిశ్చయానికి వచ్చినాడన్నమాట. అపుడు తన నర్మసచివుడైన విశారదుని పిలిచినాడు. మలయధ్వజుడు రాజుల్లో సూర్యునివంటి ప్రతాపం కలవాడు. అతనికి నారాకను గురించి వార్త తెలుపుము అని ఆదేశించినాడు.

ఈ పద్యంలో కవి ఉపయోగించిన పదాలు సాభిప్రాయంగా ఉన్నవి. చూడండి:

అంబుజములకు స్నేహితుడు కమలహితుడు. కాబట్టి అంబుజ ప్రసన్నముఖుడైన అర్జునుడు, క్షితీశ కమలహితుడైన మలయధ్వజునికి వార్తపంపడం ఎంతో సమంజసంగా ఉన్నది. హితభావం కార్యానుకూలము కదా.

అర్జునుని మనస్సులో చిత్రాంగదతో తన వివాహం జరుగవలెనని ఉన్నది. ఆ అభిప్రాయాన్ని కూడ బహు చమత్కారంగా అర్జునుని నోట చెప్పించినాడు కవి.

మామక+ఆగమనవార్త - అంటే నా రాకను గురించిన వార్త తెలుపుము అనేది సామాన్యార్థం. మామకు+ఆగమన వార్త - అంటే మామవంటి వాడుఁ అతని కూతు

రును తాను వివాహం చేసికొనబోతున్నాడు కాబట్టి ఆయన రాజుకు నా రాకనుగురించి తెలుపుమని చెప్పడం రెండవ అర్థం

మామకాగ+మనవార్త - అనగా, ఆ మలయధ్వజుని కుమార్తెను నేను వరించి నాను. అతడు నాకు తనకుమార్తెనిచ్చి వివాహం చేసి మామకావలసి ఉన్నది. అందు చేత నా రాకనుగురించి వార్తతోపాటు అతడు నాకు మామ అయ్యేటట్లుగా వార్త చెప్పవలసింది అని ఆదేశించడం మూడవ అర్థం.

చమత్కారంతో కూడిన ఈ మూడర్థాలు బహు రమ్యంగా ఉన్నాయి యీ పద్యంలో. సాభిప్రాయంగా పదాలను ప్రయోగించడమే కాక, శ్లేషాలంకారాన్ని మనోహరంగా పొదివి నా డీపద్యంలో కవి.

## 23

నలుగడ హృద్యవాద్య నటనంబొలయం, గపురంపుటారతుల్
వెలయ, ద్విజశ్రుతుల్ చెలఁగ, విప్రవధూశుభగానలీల శో
భిలఁగ, వివాహవేదికకుఁ బెండ్లికుమారుఁడు వచ్చె నిట్టు, లా
వల, నల పెండ్లికూఁతురును వచ్చె రణచ్చరణాంగదంబునన్.

అర్జునుడు విశారదుని పంపించడం, మలయధ్వజుడు తన కూతురును అర్జునున కీయ డానికి అంగీకరించడం, వివాహముహూర్త నిర్ణయం అన్నీ త్వరత్వరగా జరిగిపోయి నాయి. ఈ పద్యంలో వివాహవర్ణన ఉన్నది.

అన్ని దిక్కులలో మనోహరంగా ఉండే మంగళవాద్యాలు మ్రోగుతున్నాయి. ఇంపైన నాట్యాలు జరుగుతున్నాయి. కర్పూరపుటారతులు ప్రకాశిస్తున్నాయి. బ్రాహ్మ ణుల వేదపాఠాలు వినవస్తూ ఉన్నాయి. బ్రాహ్మణ ముత్తైదువులు విలాసంతో పెండ్లి పాటలు పాడుతున్నారు. ఇటువంటి సమయంలో ఒకవైపునుంచి పెండ్లికుమారుడైన అర్జునుడు వివాహవేదికదగ్గరకు వచ్చినాడు. ఇంకొక దిక్కునుంచి, అంటే అంతః పురంనుంచి కాలి అందెల చప్పుడు ఇంపుగా ధ్వనిస్తూ ఉండగా పెళ్ళికుమార్తె చిత్రాం గద వచ్చింది.

ఈ పద్యంలో కవి వివాహసమయంలో చెప్పిన మంగళవాద్య ధ్వనులు, వేశ్యా నర్తనలు, కర్పూర మంగళహారతులు, వేదపాఠాలు, పెండ్లిపాటలు, తెలుగువారి పెండ్లిండ్లలో సామాన్య విశేషాలే. ఈ వివాహం నిజానికి మణిపురంలో జరిగినప్పటికి, రఘునాథరాయల కాలంలో సంపన్నులైన తెలుగువారి ఇంటిలో జరిగే వివాహం లాగానే ఉన్నది.

## 24

ఇలగల వీళ్లు సూడ మన మేటికి బోవలెఁ ? బోయినన్ వనిన్
నిలువఁబనేమి ? నిల్చిన మునిం గని త్రుళ్ళగనేల ? యంతలో
నలిగి శపింపనేమిటికి నాతఁడు ? వ్రాతఫలంబు దప్పునే
కలిగినవేకదా మకరికల్ మన కెప్పుడు వ్రాసియుండుటల్.

మణిపురంనుంచి బయలుదేరిన అర్జునుడు తీర్థయాత్రచేస్తూ పంచతీర్థము చేరినాడు. అచట ఒక తీర్థమున స్నానమాడబోతే ఒక మొసలి అతని బంధించింది. దాన్ని నీటినుండి లాగి బయటవేయగా అది నంద అను అప్సర స్త్రీ రూపాన్ని ధరించింది. ఆమె తన పూర్వ వృత్తాంతం చెప్పింది. నంద అను తాను, మరి నలుగురు సఖులు భూలోక సందర్శనం చేస్తూ విహరిస్తున్నారు. అపుడు వారికి తపస్సుచేసికొనే ఒక ముని కనిపించినాడు. ఈ విలాసినులు అతని ఎదుట తమ విలాసాలను ప్రదర్శించినారు. దానికి ఆ తాపసి ఆగ్రహించి మకరస్వరూపం వహించవలసింది అని శపించినాడు. తత్పరిణామంగా వారికి మకరరూపాలు ఏర్పడినాయి. అప్పుడు వారు విచారిస్తూ ఈ విధంగా అనుకొన్నారు.

'మనం స్వర్గంలో ఉన్నవాళ్ళం అచటనే ఉండక, భూలోకంలో ఉన్న పట్టణాలు చూడడానికి ఎందుకు వెళ్ళవలె ? పోయితిమిపో ! అడవిలో ఎందుకు ఆగవలసి వచ్చింది. నిలిచినా, ఆ తాపసిని చూచి విలాసాలను ప్రదర్శించడం ఎందుకు ? అంత మాత్రానికే అతడు కోపించి శపించనేల ! ఇది చాల విచిత్రంగా జరిగిందికదా. బ్రహ్మ ఈ విధంగా వ్రాసినాడు కాబోలు. విధివ్రాత తప్పదుకదా. మనం మన సుకుమారమైన అంగములమీద కస్తూరికాది సువాసన ద్రవ్యాలతో మకరికా పత్రాలు అలంకారంగా వ్రాసుకొంటాము. ఆ వ్రాత ఫలితంగా మనకీ మకరరూపాలు వచ్చినవి కాబోలు."

ఎప్పుడూ భగవన్నామాన్ని వ్రాస్తుండేవారు దాని ఫలితంగా సారూప్యం చెందినట్లే, మనం ఎల్లప్పుడు మకరికాపత్రాలు వ్రాస్తూ ఉండడంచేత మకరరూపాలు సిద్ధించినాయి అని చమత్కారంగా అచ్చర లనుకొన్నారు. ఈ అచ్చరలు ఆపదలో ఉన్నప్పుడు కూడ చతురోక్తులు ఆడటము రమణీయంగా ఉంది. వారి నిత్యయౌవన లక్షణాన్ని వ్యక్తంచేస్తూ ఉన్నది. ఈ పద్యంలోని అలంకారం, అర్థాంతరన్యాసం.

## 25

మృగనాభి తిలకంబు బుగబుగల్గల లలా
టముపై మృదూర్ధ్వపుండ్రంబు దీర్చి
తపనీయ కౌశేయ ధౌరేయ మగుకటీ
రమునఁ గాషాయ వస్త్రము ధరించి
శరణాగతాభయ సంధాయకంబైన
దక్షిణపాణిఁ ద్రిదండ మూని
రణ చండ కోదండగుణకిణాంకంబైన
డాకేల నునుఁ గమండలువు దాల్చి
యుండెఁబో శాంతరస మెల్ల నుట్టిపడఁగ
నంగనల పొందు రోసి సన్న్యాసి యగుట
గద యుచితమెందు, నా నవమదనమూర్తి
యంగనామణిఁ గోరి సన్న్యాసి యయ్యె.

అర్జునుడు అప్సరలకు శాపవిమోచనం కలిగించి తీర్థయాత్ర చేస్తూ ప్రభాస తీర్థం చేరినాడు. అక్కడికి ద్వారకానగరం దగ్గరగా ఉన్నదని విన్నాడు. ఇంక సుభద్ర సౌందర్య విశేషాలు తనివితీర చూడవచ్చు కదా అని సంతసించినాడు. కాని తాను అర్జునుడుగా కాక, యతిగా పోతే తనపని చక్కగా కొనసాగుతుంది. యతులగా యాదవులు విధేయులు కావడమే దానికి కారణం. అందుచేత తన పరివారాన్ని దూరంకు వంపివేసి తాను సన్న్యాసివేషం ధరించినాడు. ఆ వేషం ఈ విధంగా ఉన్నది. (ఈ పద్యంతో విజయుని మూడవ విలాసం ప్రారంభం)

ప్రతినిత్యం సువాసనలను వెదజల్లే కస్తూరినామాన్ని ధరించే నురుటిపై మట్టితో చేసిన తిరుమణితో ఊర్ధ్వపుండ్రములు (నిలువు నామాలు) దిద్దుకొన్నాడు. ఎప్పుడూ బంగారుపైటంచులు గలిగిన పట్టువస్త్రాలు కట్టే తన నడుముకు కావిరంగు బట్టలు ధరించినాడు. శరణువేడిన వారికి అభయాన్ని ప్రసాదించి కుడిచేతిలో త్రిదండమనే కర్రను ధరించినాడు. యుద్ధాల్లో తీక్షణంగా ఉండే ధనస్సులోని అల్లెత్రాటిచేత కాయలు కాచిన గుర్తులుండే ఎడమచేతిలో నున్నగా మెరుస్తున్న కమండలువు అనే పాత్రను తాల్చినాడు. ఈ వేషంలో ఉన్న అర్జునుడు శాంతరసం పైకి కనిపించేటట్లుగా ఉన్నాడు. లోకంలో స్త్రీలమీద అసహ్యం కలిగి సన్న్యాసం తీసికొనడం సహజమే. కాని, మన్మథుని వంటి సుందరాకారం కలిగిన ఈ విజయుడు, ఒక నారీతిలకాన్ని పొందటానికి సన్న్యాసి అయినాడు. ఇది విచిత్రంకథా.

సాధారణంగా స్త్రీల సాంగత్యాన్ని అసహ్యించుకొన్నవారే సన్యాసులవుతారు. ఇతడు స్త్రీని (సుభద్రను) కోరి సన్యాసి అయినాడు. ఇది లోకవ్యవహారానికి విరుద్ధంగా ఉన్నది.

లోకంలో ధానుష్కులకు అల్లెత్రాటివల్ల కుడిచేతికి కాయలుకాయడం ఉంటుంది. అర్జునుడు సవ్యసాచి కావడంచేత అతని ఎడమచేతికి అల్లెత్రాటి రాపిడిచేత కాయలు కాసినవని కవి భావం. విరోధాభాసమనే అలంకారం ఉన్న దీ పద్యంలో.

## 26

చూడమె దేవతాసతుల శోభనకాంతి విలాసవైఖరుల్ ?
చూడమె నాగకన్యకల లోక మనోహర రూపసంపదల్ ?
చూడమె మర్త్యకామినుల సోయగముం ? దమకంబు పెల్లు తీ
పాడగ దీనివంటి యొరపైన మిటారిని చూడ మెందులన్.

సుభద్రను చూడవలెననే కోరికతో అర్జునుడు ద్వారకలో శ్రీకృష్ణుని సాయంతో ప్రవేశించినాడు. కొద్ది కాలంలోనే ఆ నవమోహనాంగి సుభద్రను చూసే అవకాశం వచ్చింది. ఆమె సౌందర్యానికి భ్రమసి అర్జునుడు తనలో తా నీవిధంగా భావించినాడు.

"ఇదివరలో దేవలోకంలో ఉండే కాంతల సుందరమైన విలాసవైఖరులను చూచితిని. పాతాళలోకంలోఉండే నాగకన్యల మనోహరమైన రూపసంపదను దర్శించినాను. భూలోకంలోని స్త్రీ సౌందర్యాన్ని పరికించినాను. కాని యీ సుభద్రవంటి అందమైన ఒయ్యారిని, ప్రేమాస్పదంగా ఉండి మోహం గలిగించేదాన్ని మాత్రం ఎచటను చూడలేదు."

అర్జునుడు సుభద్రను గురించి యీ విధంగా భావించడంలో విచిత్రం లేదు. పంచతీర్థాలలో శాపవిముక్తలైన దేవలోక స్త్రీల సౌందర్యాన్ని అతడు సందర్శించినాడు. నాగలోకవాసియైన ఉరగాంగనయగు ఉలూచి వివాహాన్ని పీక్షించినాడు. మనుష్య భామిని చిత్రాంగద సోయగాన్ని కనుగొన్నాడు. కాని ఈ సుభద్ర అందాన్ని వారితో పోల్చితే, చాల అధికంగా ఉన్నది. అంటే సుభద్ర త్రిలోక సుందరి అన్నమాట.

## 27

సుందరి రానిచో నెదురు సూచుచు నుండనె పట్టె; వచ్చుచో,
నిందునిభాస్య చక్కఁదనమే కనిచొక్కుచునుండఁబట్టె; నీ
సందడిచేతనే యగుగసాగెను బ్రొ; ద్దిఁక వేళ యెప్పుడో
సందెజపంబు నర్చనలు సల్పుట నాకపటత్రిదండికిన్.

అర్జునుని ఉపాయం చక్కగా నెరవేరింది. సన్యాసివేషంతో ద్వారకానగరంలో ప్రవేశించడమే కాదు. సుభద్రను దర్శించడమే కాదు. బలరాముని భక్తిశ్రద్ధల కారణంగా రాణివాసపు టుద్యానవాటికలో నివాసము, కన్యకామణి సుభద్ర పరిచర్య కూడ లభించినవి. ఆ సుభద్ర ఈ కుహనా సన్యాసికి నిత్యం, జపాదులకు కావలసిన వస్తువులందిస్తూ పరిచర్య చేస్తూనే ఉన్నది. కాని ఆమెకు ఇతడు అర్జునుడని తెలియదు. ఇక అర్జునుడు మాత్రం ఆమె సౌందర్యాన్ని సందర్శించి ఆనందిస్తూనే ఉన్నాడు. ఆ కపట సన్యాసి తపమును గురించి కవి ఈ పద్యం వ్రాసినాడు.

ఆ ఉద్యానవనంలో ఉన్న అసత్యపు సన్యాసికి, సుభద్ర పరిచర్య చేయడానికి రాని సమయంలో, ఆమె రాకకై ఎదురుచూడడంతోనే సరిపోతుంది. సుభద్ర వచ్చినప్పుడు చంద్రముఖియైన ఆ సుందరి చక్కదనాన్ని సందర్శించి పారవశ్యం చెందడంతోనే వేళ గడుస్తుంది. ఈ రెండు పనులతోనే కాలం గడుస్తూ ఉన్నది. ఇక ఆ సన్యాసికి సంధ్యావందనాది విధులు తీర్చడానికి గాని, దేవతార్చనలు చేయడానికిగాని వ్యవధి ఎక్కడిది ?

అర్జునుడు సన్యాసిగా మారినది కాని, ద్వారకానగరం వచ్చినది కాని సుభద్ర కొరకే కదా ! జపతపాదులు చేసుకోవడానికి కానేకాదు. అందుచేతనే ఆయన తన సమయమంతా సుభద్రకొరకే వెచ్చిస్తున్నాడని కవి భావం.

సుభద్ర ఎదుట ఉన్నా, లేకపోయినా, ఒక్క విధంగానే కాలం గడుస్తున్నది అర్జునునికి అని కవి సూచిస్తున్నాడు.

## 28

"చెలువ, నిను రాజకీరంబు చేట్టపట్టెఁ
గలికి, నిను రాజహంసంబు కాలుద్రొక్కె,
మంచి శకునంబు లివి; నాదుమాటఁ జూడు
కన్నె, యీలోనఁ బెండ్లి కాఁగలదు నీకు"

ఒకసారి లీలాశుకమును చేతిలో గ్రహించి, రాజహంసల సమీపంలో ఉన్న సుభద్రను చూసి, మాయ సన్యాసిరూపంలో ఉన్న అర్జునుడు సాభిప్రాయంగా అన్నమాట లివి.

"ఓ సుందరీ, అందమైన మంచి చిలుక నీ చేయి పట్టుకొన్నది. శ్రేష్ఠమైన హంస నీకు సన్నిహితంగా వచ్చి నీ కాలు తొక్కింది. ఈ రెండు కూడ మంచి శకునాలే. అందుచేత నీకు త్వరలోనే వివాహం జరుగుతుంది. నా మాట పాటిచూడు."

ఈ అర్థంకాక మరొక అర్థం ఉన్న దాపద్యంలో. రాజకీరము అంటే ఒకానొక రాజశ్రేష్ఠుడు నీ చేయి పట్టుకొనును అనగా వివాహమాడుతాడు. ఆ రాజశ్రేష్ఠుడునీ

కాలు దొక్కి నిన్ను పరిణయమాడుతాడు. అందుచేత త్వరలోనే నీకు వివాహం జరుగుతుంది. నా మాట చూడు.

ఇచట అర్జునుడు యతీశ్వరుడు కాబట్టి శకునాలను గురించి చెప్పడంలో ఔచిత్యం ఉన్నది. కన్యలను సుముఖం చేసుకోవడానికి వివాహప్రస్తావనకంటె విశేషం మరొకటి ఉండదు. అర్జును డీ ప్రస్తావన చేసి సుభద్రను చనువు చేసికొంటున్నాడను కొనవలె. శకునములు అంటే భవిష్యత్తును సూచించే విశేషాలు కాక, పక్షులు అనే వేరొక అర్థం ఉన్నదనీ, ఇచట సూచనలు చేసిన చిలుక, రాజహంస పక్షులనీ; అందు చేత 'మంచి శకునంబులివి' అన్నప్పుడు మంచి పక్షులివి అనే అర్థాన్నికూడ గ్రహించ వచ్చునని శ్రీ తాపీ ధర్మారావుగారు వ్రాసినారు.

## 29

మేరలాయివి మీయంతవారలకును
బెద్దలున్నా రెఱిఁగి వారె పెండ్లిసేయఁ
గలరు, వేగిరపాటింత వలదటంచు
విన్నపము సేయరాదె యోచిన్నిచిలుక.

యతి రూపంలో ఉన్నవాడు అర్జునుడు. అతడు తనకొరకే ఈ రూపం ధరించి ద్వారకా నగరపు టుద్యాన వనంలో ప్రవేశించినాడు అని సుభద్రకు తెలిసింది.

అర్జునుడు తన కోర్కెను వెల్లడించినాడు. అంతేకాదు అనురాగంతో ఆమె చెయి పట్టుకొన్నాడు. సుభద్ర జాగ్రత్తగా తన చేతిని విడిపించుకొనడానికి ప్రయ త్నిస్తూ అంటున్న మాట లివి. ప్రత్యక్షంగా ఉన్న అర్జునునితో కాక తన విలాసపు చిలుకతో అర్జునుడు వినేటట్లుగా ఈ విధంగా అంటున్నది.

'మీవంటి సుప్రసిద్ధులకు, అభిజాత్యం కలిగినవారికి ఇవి మర్యాదలగునా! పెద్దలు ఉన్నారు. వారు సంగతి తెలిసికొని వివాహం చేస్తారు. ఇంతగా తొందరపడడఘు దగదని వారికి విన్నవింగవే ఓ చిన్నిచిలుకా!'

ఈ పద్యంలో సుభద్ర అర్జునునితో తన వివాహం జరగడం సమ్మతమే అని వెల్లడించింది. అదికాక తన ఉచితజ్ఞతను, పెద్దలపై ఉండే గౌరవాన్ని అర్జునునిపై అనురాగాన్ని చక్కగా వ్యక్తం చేసింది. అర్జునుడు కూడ తనలాగే గౌరవప్రదంగా ఉండాలని, అభిజాత్యం ప్రదర్శించాలని ఆమె అర్జునునితో సూచనాప్రాయంగా చెప్పింది.

## 30

ఎక్కడఁ జప్పుడైనఁ, దరళేక్షణ వచ్చె నటంచు లేచు; నే
దిక్కున నల్కుడైన, సుదతీమణి మాటని యాలకించు; నే
చిక్కఁదళుక్కు మన్న, నెలజవ్వని మైసిరియంచుఁ జూచు; న
మ్మక్క! కిరీటి మోహసముదగ్రత నే మనవచ్చు నయ్యెడన్.

ఎటులో చమత్కారంగా మాట్లాడి సుభద్ర తనచేయి విడిపించుకొని అంతఃపురంలోకి వెళ్ళిపోయింది. ఇంక కాన్పించనేలేదు. నిన్నటివరకు శుశ్రూషకు వస్తూ ఉండిన సుభద్ర ఈ వేళకూడ ఆనెపంమీద వస్తుందేమో అని అర్జునుని భావం అందు చేత ఉత్కంఠతో ఆమె కొరకు నిరీక్షిస్తూ ఉన్నాడు.

ఎక్కడ చప్పుడైనా, చంచలములైన వీక్షణాలు కలిగిన సుభద్ర వస్తున్నదనుకొని లేచి నిలబడతాడు. ఏవైపున అలికిడి అయినా, సుభద్రాదేవి మాట్లాడుతున్నదని చెవి యొగ్గి వింటాడు. ఏ ప్రక్కన వెలుగు కనిపించినా, లేజవ్వనియైన సుభద్ర శరీర కాంతి అనుకొని చూస్తాడు. ఆ సందర్భంలో కిరీటికి సుభద్రపైగల మోహాతిశయం ఏమని చెప్పవచ్చు.

సుభద్రతో విరహం కలుగగా అర్జునునికి కలిగిన అవస్థను కవి వర్ణించినాడు, దానిలో అతడు సమస్త విషయాలు మరచి పోయినాడనీ, ఏదిక్కు ఏమి వినిపించినా ఏమి కనిపించినా సర్వం సుభద్రాదేవిగానే ఉంటుందని చెప్పడం కవి ఉద్దేశ్యం. ఇంత గాఢమైన మోహం కలవాడు కాబట్టే సుభద్రను విజయుడు చేపట్టడానికి అర్హుడు అని సూచన ప్రాయంగా దీనిలో చెబుతున్నాడు కవి.

దీనిలో అర్జునుని ఉత్కంఠ అధికంగా మనకు కనిపించినప్పటికి, ప్రబంధాల్లో ఈలాంటి అతిశయ వర్ణన సామాన్యమే.

## 31

చక్కెరవింటి రాజు నగచాపునితో నెదిరించిపడ్డనాఁ
డెక్కడనుంటి వీవు? మధుఁ డెక్కడ నుండెను? మందమారుతం
బెక్కడనుండె? సిగ్గుపడరే మిపు డాతఁ డదృష్టరేఖచే
రక్కొని క్రమ్మఱం బ్రతికిరాఁగ వజీర్లయినారుగా శశీ.

నాయకుడు విజయునివలెనే నాయిక సుభద్ర కూడ విరహాన్ని అనుభవించింది. ఆమె అవస్థ చూచి వదినెలు ఎక సక్కెము లాడినారు. చెలులు శీతలోపచారాలు చేసినారు. కాని ఆమె విరహతాపం అతిశయించిందే తప్ప తగ్గలేదు అప్పుడు వియోగ

తాపాన్ని అధికంచేస్తున్న చంద్రుణ్ని, వసంతుణ్ని, మన్మధుణ్ని సుభద్రాదేవి చెలికత్తెలు ఉపాలంభిస్తున్నారు.

"ఓ చంద్రమా, పూర్వం చక్కెరవిల్లు కల మన్మథుడు, మందరపర్వతం విల్లుగా కలిగిన త్రినేత్రుడైన శివునితో పోరాడి కూలిపోయిననాడు నీవు ఎక్కడ ఉన్నావు. అతనికి సాయం రాకపోయితివేమి ? వసంతుడు ఎక్కడికి వెళ్ళినాడు, మలయమారుతుడు ఎటుపోయినాడు, వా రెవరును అతనికి బాసటగా రాలేదుకదా. మీ రెవరును ఆనాడు కనిపించలేదే. ఇపుడు ఆ మన్మథుకు అదృష్టవశాన బ్రతికి బయట పడగా, నీవు, వసంతుడు, మలయపవనుడు అతనికి పెద్ద మంత్రులైనారుకదా, మా చెలి సుభద్రను తపింపచేస్తున్నారా"

శివుని కంటిమంటలో మన్మథుడు భస్మమైపోయినప్పుడు అతని మిత్రులు చంద్రుడు, వసంతుడు, సమీరుడు కనిపించకుండా వెళ్ళిపోవడము, తిరిగి అతడు బ్రతికి బయడపడినప్పుడు చుట్టూచేరి పెద్దరికము వహించడము వారి నీతిలేని ప్రవర్తనను తెలుపుతుందని భావం అందుకే చెలులు వారిని మీకు సిగ్గు కలుగలేదేమి అని ప్రశ్నించినారు.

అదృష్టరేఖచే అనే పదంమీద చమత్కరించినాడు కవి. శివునితో యుద్ధం చేసిననాడు మన్మథునికి అందమైన రూపమే ఉండేది. కాని తిరిగి బయటపడేనాటికి ఆ రూపం పోయి అతనుడైనాడు. దృష్టంకాని-కనిపించని రూపమే అతనికి మిగిలింది. అందుకే 'అదృష్టరేఖచే' అతడు బ్రతికి బయటపడ్డాడట.

కష్టకాలంలో కనిపించకుండాపోయి, అదృష్టం కలిగినప్పుడు వచ్చి అధికారం చెలాయించే స్నేహితులుండడం లోకసామాన్యమే కదా.

ఈ ఉపాలంభన కార్యక్రమం కూడ ప్రబంధాల్లో సామాన్యాంశమే.

## 32

తమ తమ వార లొండొరుల దండకరంబుల ముత్తియంపుఁ బ
ళ్లెము లిడి 'చేయిమించఁగ వలెంజుమి' నీకని యెచ్చరింపఁగా
నమితముగా సుభద్రపయి నర్జునుఁ డర్జునుపై సుభద్రయున్
దమిఁ దలఁబ్రాలు వోసి రెలనవ్వును సిగ్గును లోఁదొలంకఁగన్.

సుభద్రార్జునులకు పరస్పర మేర్పడిన అనురాగము, వారి విరహావస్థ చెలుల ద్వారా మొదట దేవకీ దేవికి, తరువాత కృష్ణునికి, అతని రాణులకు తెలియవచ్చినది. ఇక వారి నీ యవస్థనుండి తప్పించడానికి వివాహం చేయడమే మార్గమని త్వరలోనే ముహూర్తమును నిర్ణయించినారు, మంగల స్నానాది విధుల నిర్వర్తించి వధూవరులను

శోభనప్రథంగా అలంకరించినారు. సమస్తబంధువులు (బలరాముడు తప్ప) ఆ వైభవం చూడడానికి ఏతెంచినారు. అమరావతినుండి సపరివారంగా ఇంద్రుడు కూడ విచ్చేసినాడు. పెండ్లి వైభవాన్ని వర్ణిస్తున్నాడు కవి యీ పద్యంలో.

వివాహంలో ముఖ్యఘట్టం, వధూవరులు పరస్పరం తలంబ్రాలు పోసుకోవడం. వారిద్దరిలో ఎవరు ఎక్కువ తలంబ్రాలు ఇంకొరిమీద పోస్తే సాంసారిక జీవితంలో వారికి ఆధిక్యత ఉంటుందని లోకుల విశ్వాసం. ఆ కారణంగా, ఆ కార్యక్రమంలో వధువువైపు ఆమె పక్షంవారు, వరునివైపు అతనిపక్షంవారు చేరినారట. తలంబ్రాలకొరకు ముత్యములతో నిండిన పళ్ళెములు అందించినారు. మగపెండ్లివారు అర్జునుని నీదే పైచేయి అయేటట్లుగా తలంబ్రాలు సుభద్రపై అధికంగా పోయవలె అని హెచ్చరిక చేస్తున్నారు. ఆడపెండ్లివారు తక్కువవారేమీకాదుకదా. వారు సుభద్రను నీవు ఆధిక్యత సంపాదించవలెసుమా అని ప్రోత్సహిస్తున్నారు. ఇట్లా జరుగుతూ ఉంటే వధూవరులు తమ ముఖంలో చిరునవ్వు కనిపిస్తూ ఉండగా, మనస్సులలో సిగ్గు కలుగుతూ ఉండగా కోరికతో ఒకరిమీద ఒకరు తలంబ్రాలు పోసికొన్నారు.

ఈ వివాహకార్యక్రమం చూస్తే తెలుగుదేశంలో తెలుగువారి పెండ్లిలాగే కనిపిస్తుంది. ముత్యాలనే తలంబ్రాలుగా వాడడం వారి సంపదను సూచిస్తుంది.

అలంకారాల్లో సహజసుందరంగా ఉండే స్వభావోక్తి అలంకారం ఈ పద్యంలో ఉన్నది.

## 33

మృగమదము చెంతఁ గుంకుమరేఖవోలె
నీలమణి పొంత నుదిరి పొ(బ)్రేకు వోలె
మేఘము కుఱంగటను దీఁగమెఱపువోలె
నర్జునుని చెంగట సుభద్ర యలరె నపుడు.

వివాహం అయిన తరువాత వధూవరులైన సుభద్రార్జునులను బంగారు పీటపై కూర్చుండబెట్టినారు. వారి సౌందర్యవిశేషాన్ని చూడడానికి వేయికండ్లు చాలవు. వారెట్లా ఉన్నారో చెబుతున్నాడు కవి.

అర్జునుని ప్రక్క సుభద్ర ఉన్నది. అర్జునుడు కస్తూరిలాగ ఉంటే సుభద్ర కుంకుమపూవు రేఖలాగ ఉన్నది. విజయుడు ఇంద్రనీలంలాగ ప్రకాశమానంగా కనిపిస్తే, అతని ప్రక్కన అతనిభార్య మేలిమిబంగారు రేకువలె ఉన్నది. కథానాయకుడు నల్లని మేఘాన్ని పోలిఉంటే, కథానాయిక మెరుపుతీగవంటిదిగా ఉన్నది. ఈ విధంగా సుభద్రాదేవి సౌందర్యం ప్రకాశిస్తూ ఉన్నది.

అర్జునుడు నల్లనివాడు కాబట్టి అతన్ని కస్తూరి, ఇంద్రనీలమణి, మేఘము అనే వాటితో పోల్చడం; సుభద్ర మేలిమి పసిడివన్నె కలది కాబట్టి ఆమెను కుంకుమరేఖ, బంగారురేకు, మెరుపుతీగ అనే వాటితో పోల్చడం ఎంతో ఉచితంగా ఉన్నది.

ఈ పద్యంలో కవి గ్రహించిన ఉపమానాలుకూడ ఒకదానితో ఒకటి చక్కని పొందిక కలిగినట్టివి. పరిమళ ద్రవ్యాలైన కస్తూరికి, కుంకుమరేఖకు గల సాన్నిహిత్యాన్ని చెప్పవలసిన పనిలేదు. నీలమణులు, బంగారము, ఇవి కూర్చితేనే ఆభరణాలు అవుతవి. అందుచేత వాటికిగల సంబంధం లోకానికే తెలుసు. ఇక మేఘం లేనిది మెఱుపులేదు. మెఱుపులేనిది మేఘంకాదు. వాటి సాహచర్యం అంత గాఢమైంది. ఈ ఉపమానాలను గ్రహించి సుభద్రార్జునులు పరస్పరం అంత గాఢానురాగం కలవారు అనే విషయాన్ని ధ్వనిపూర్వకంగా సూచించినాడు కవి.

చేమకూర కవి వ్రాసిన ఈ పద్యం చదువుతూ ఉంటే, పోతనామాత్యుడు వ్రాసిన 'మెఱుగు చెంగటనుండు మేఘంబుకై వడి నువిదచెంగట నుండి యొప్పువాడు' అనే పద్యం జ్ఞప్తికి రాక మానదు.

అలంకారాల్లో అగ్రేసరమై, తలమానికం వంటిది అయిన ఉపమాలంకారాన్ని బహుసుందరంగా ప్రయోగించినాడు కవి ఈ పద్యంలో.

## 34

"రకపుం జెయ్వులఁ దా వినోదముగ సారథ్యంబుఁ గావించు క
న్యకపైఁ బెట్టిన చూపెకాని, యిటు సేనం జూచుటే లేదు; సా
యక పంక్తుల్ నడుచున్ సహస్రములుగా, నయ్యారె! వివ్వచ్చు చే
తికిఁ గన్నుల్ గల" వంచు నెంచి రపు డెంతే వీరయోధాగ్రణుల్.

వివాహమైన వెంటనే సుభద్రార్జునులను రథంపై కూర్చుండజేసి ఇంద్రప్రస్థపురానికి పంపించినారు సుభద్ర తల్లిదండ్రులు. మార్గమధ్యంలో, వివాహవిషయం తెలియని యాదవులు వారి రథాన్ని అడ్డగించినారు. యుద్ధానికి పూనుకొన్నారు. సుభద్ర సారథ్యం చేస్తూఉంటే అర్జునుడు వారిని పారద్రోలడానికి తలపడ్డాడు. అర్జునుని శౌర్యం, యుద్ధనైపుణి చూచిన యాదవవీరులు అతని పరాక్రమాన్ని ఈ విధంగా మెచ్చుకొన్నారు.

"చిత్రవిచిత్రమైన గతులతో సుభద్ర వినోదంగా రథం నడిపిస్తూఉంటే, ఆమె విలాసాన్ని మాత్రమే నరుడు చూస్తున్నాడుకాని సైన్యంవైపు చూడడమేలేదు. అయినప్పటికీ, అసంఖ్యాకమైన బాణాలు ఎదుటివారిమీద పడుతూనే ఉన్నాయి. (అంటే సరిగా శ్రద్ధచూపకపోయినా, బాణాలు ప్రయోగించడంలో లోపం లేదన్నమాట) ఆహా,

నిజానికి అర్జునుని చేతికే కండ్లు ఉన్నట్లుగా ఉన్నవి. (చేతులే చూసట, బాణాలు వేయుట అనే రెండు పనులను చేస్తున్నాయని భావం).

యుద్ధం చేయడం సుభద్రార్జునులకు వినోదంగా ఉన్నది. ఆమె రకరకాలుగా ఉండే గతులతో రథాన్ని నడిపిస్తూ ఉన్నది. దాన్ని మెచ్చుకొంటూ విజయుడు తన చూపును ఆమెపై లగ్నంచేసినాడు. అవలీలగా శత్రువులను జయించగలమనే భావం ఈ జంటకు ఉన్నది అనే విషయాన్ని కవి సూచించినాడు.

ప్రబంధాల్లో రసవైవిధ్యానికి అప్పుడప్పుడు వీరరసాన్ని కూడా ప్రదర్శిస్తూ ఉంటారు తద్రచయితలు. ఇచట లీలాప్రాయంగా వీరరసాన్ని ప్రయోగించి, ఆ రస వైవిధ్యాన్ని చేమకూరకవికూడ సాధించినాడు.

ప్రబంధాలలో సామాన్యంగా కనిపించే అతిశయోక్తి అలంకారం ఉన్నది దీనిలో.

### 35

'కలయఁగ మంచి లగ్న మిది, గట్టిగ నే గడె లెన్ని యయ్యెనో
తెలిసెద' నంచు నొర్తు, 'జనుదేర ద దే'మని యొర్తు 'నెచ్చెలిన్
బిలిచెద' నంచు నొర్తు, నొకపేరిడి వా రిటులేగి రంద; అ
చ్చెలియల వెంటనే సగము సిగ్గరిగెన్ దరుణీలలామకున్.

యాదవులను మరలించి సుభద్రార్జునులు ఇంద్రప్రస్థపురం చేరినతరువాత, బలరామా దులు వీరి వివాహాన్ని ఆమోదించిన తరువాత కవి చెప్పిన పద్య మిది.

ఈ పద్యంలో శోభనపు గది ప్రసంగ మున్నది. అర్జును డున్న గదిలోనికి పెళ్ళి కుమార్తె అయిన సుభద్రను ఆమె చెలికత్తెలు తీసికొనివచ్చారు. ఇక నాయికా నాయకు లకు ఏకాంతం సమకూర్చవలసి ఉన్నది. ఆ అవకాశాన్ని కలిగిస్తున్నారు చెలికత్తెలు.

'వధూవరుల కలయికకు ఇది మంచిలగ్నము. ఎన్ని గడియలు వేళైనదో కను గొని వత్తును' అంటూ ఒక చెలికత్తె పోయింది. 'వేళచూచుటకు వెళ్ళిన చెలి రానేలేదు ఏమి కారణమో' అంటూ ఇంకొక చెలి వెడలిపోయింది. 'వెళ్ళినదాన్ని పిలుచుక వస్తాను' అని ఇంకొకచేటి వెడలింది ఈ విధంగా ఏదో నెపం చెప్పి సుభద్రవెంట వచ్చిన చెలికత్తెలందరూ వెళ్ళిపోయారు. ఇప్పటిదాక సిగ్గుపడుతున్న యువతీరత్నం సుభద్ర సిగ్గులో సగం ఆ చెలికత్తెలతోనే వెడలిపోయింది.

కాంతలు సాధారణంగా ప్రదర్శించే సిగ్గు, ప్రియునితో ఏకాంతం లభించినప్పుడు ఉండదని కవి భావం కాబోలు.

ఈ పద్యంతో విజయవిలాసాలు మూడును ముగిసినవి. 'విజయవిలాసం' ముగిసినదే.

**36**

ఇంతుల చూపు నాటుకొను టెందరుదే మగవారి చిత్తమున్ ?
గాంతల కన్నుసన్నె మెలంగుఁగదా మరునంబకంబు లా
ద్యంతము లెంచిచూడ జవరాంధ్ర యెడాటములందు శక్యమే
యెంతటి వానికైనఁ జలియింపక బిగ్గ మనంబు నిల్పఁగన్ ?

చేమకూర వేంకటరాజే రచించిన సారంగధర చరిత్రము అనే కావ్యంలోని దీ పద్యం. రాజ నరేంద్రుడు వేటాడుటకు వెడలినప్పుడు అతని కుమారుడైన సారంగ ధరుడు పావురాలతో వినోదిస్తూ ఉంటే ఒక పావురం చిత్రాంగి మేడపైవాలి అమె భవనంలోనికి వెడలిపోయింది. ఇతరు లెవరినైనా పంపించి, పారావతాన్ని తెప్పిం చడం ఉచితంకాదని స్వయంగా సారంగధరుడే చిత్రాంగి భవనానికి ప్రయాణ మవు తాడు. ఆ విషయం తెలిసి అతని స్నేహితుడైన సుబుద్ధి చెప్పేమాట లివి.

"పురుషుల మనస్సులో సుందరీమణుల చూపులు నాటుకొనుట విచిత్రం కాదు కదా. అంటే స్త్రీలచే పురుషులు ఆకర్షితులవుతారుకదా. అదేమి వింతయోకాని, మన్మథుని బాణాలుకూడ స్త్రీల ఆజ్ఞలోనే ప్రవర్తిస్తాయి. స్త్రీ పురుషుల ప్రణయానికి స్త్రీలే ప్రధానులని భావం. ఎంతటి ధీర మనస్కుడైన పురుషుడైనా, స్త్రీలతో సమా గమము ఏర్పడినప్పుడు మనస్సులో సంచలనం కలుగనీయక నిగ్రహించుకోవడం శక్యంకాదు కదా."

లోకంలో ఉండే సామాన్య ధర్మాన్ని, ప్రవర్తనకు వివరించి, సుబుద్ధి తన స్నేహితుడైన సారంగధరుని చిత్రాంగి మేడకు వెడలవద్దని హితోపదేశం చేస్తున్నాడు. ఈ విధంగా కథా సందర్భంలో చక్కగా సరిపోయిం దీ పద్యం.

కావ్యానికి హితబోధ ప్రధాన ధర్మం. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కావ్యం నీతిని బోధించవలె. కవి ఈ పద్యంవలన దుష్ట స్త్రీల ప్రవర్తనను, వారు పురుషులను లోబరచుకొనే విధానాన్ని వివరించి పాఠకులకు చక్కని నీతిని అందించినాడు. ఈ పద్యంలో అర్థాంతరన్యాసాలంకారం ఉన్నది.

**37**

"కంతుఁడో, కాక యారజనికాంతుఁడో, లేక జయంతుఁడో యితం
డెంతవిలాస! మెంతకళ! యెంతయొయార !" మటంచు విస్మయా
క్రాంత మనంబుతోడఁ బులకల్ దొలకన్ గనురెప్పవేయక
క్కాంత మహాభిలాషఁ దటకాపడి చూచెఁ గుమారశేఖరన్.

పావురంకొరకు సారంగధరుడు తన భవనంలో ప్రవేశించగా, అతన్ని చూ? చిత్రాంగి యవస్థను వర్ణించినాడు కవి యీ పద్యంలో.

సుందరాకారుడు, నవయౌవనుడు అయిన సారంగధరుని చూడగానే చిత్రాంగికి సాత్త్వికభావ లక్షణాలు పొడసూపినవి. ఆమె మనస్సు ఆశ్చర్యంతో నిండిపోయింది. అతడు అందమైనవాడు అనే మాటైతే విన్నదికాని, ఇంతటి లోకోత్తర సౌందర్యం కలవాడని ఆమెకు తెలియదు. అందుకే విభ్రమం కలిగింది. శరీరంపై గగుర్పాటు కలిగింది. అంతేకాదు కనురెప్పవేయక నిశ్చలమైన దృష్టితో అతనిని దర్శించింది. మనసులో అతనిమీద కోరిక కలిగింది. ఈ అవస్థలో ఉన్న చిత్రాంగి ఈ విధంగా భావించిందట: "ఇతడు మన్మధుడేమో, లేక శశాంకుడేమో, అదికాక పోతే ఇంద్రుని కుమారుడైన జయంతుడు కావచ్చు". లేకపోతే ఈ కుమార శేఖరునిలో ఇంతకళ, ఇంతటి సౌందర్యం ఎచటి నుండి వస్తుంది?" కథానాయకుడైన సారంగధరుడు అనన్యసామాన్యమైన అందగాడు అనే విషయాన్ని చెప్పడానికే కవి ఈ పద్యం వ్రాసినాడనిపిస్తుంది. ఈతని సౌందర్యమే కథకు బీజభూతమైంది.

## 38

మొలక లొకింత గానబడి, మోసులు మెల్లన వెళ్లి, సోగలై
నెలకొని; వ్రేళ్లుగోళ్లును జనించి, చొకారములై, మిటారి కెం
దలిరుకు బొమ్మగట్టి, యలతమ్ముల యెమ్ములు చూఱవట్టి, యిం
పలరగ వచ్చె వాని కిరవై తగ వింతగఁ గాళ్లు సేతులున్.

సారంగధరుడు నేరము చేసినాడని భావించి రాజు అతని కాళ్లు చేతులు నరికించి శిక్ష విధించినాడు. కొంత కాలమునకు మత్స్యనాధుడను యతీశ్వరుడు సారంగధరుని చూచి అతడు నిర్దోషియని తెలిసికొని, అతనిపై దయదలచి, తన ప్రభావము చేత తిరిగి అతనికి కాళ్లచేతులు మొలిపించినాడు.

అంగములు ఖండింపబడిన సారంగధరునికి కాలుసేతు లెట్లు తిరిగి వచ్చినవో ఈ పద్యమున కవి వర్ణించెను. మొదట మొలకలవలె కొద్దిగా కాన్పించినవి. తరువాత మోసులెత్తినట్లుగా పైకి వచ్చినవి. పొడవుగా పెరిగినవి. ఆ పైన కాళ్లు వచ్చినవి. ఇంక గోళ్లు మొలిచినవి. సుందరంగాను, ఎర్రగాను చివురుటాకులుగా కాన్పించినవి. తరువాత ఎముకలు కలిగి గట్టిపడినవి. ఇట్లు చూచేవారికి ఆశ్చర్యం కలిగేలాగ సారంగధరునికి తిరిగి కాళ్ళుసేతులు వచ్చినవి.

సారంగధరుని కథ చదివినంతసేపు. ఇది విషాదాంత మవుతుందేమో అనిపిస్తుంది మనకు. కాని, విషాదాంతం నాటకాలుకాని, కావ్యాలుకాని వ్రాయడం మన కవుల సంప్రదాయానికి విరుద్ధం. అందుచేత కావ్యాంతంలో అద్భుత రసాన్ని ప్రయోగించి ఐనా కథను మోదాంతం చేస్తారు మన కవులు. ఆవిధంగానే కథానాయకుడైన సారంగధరుడు కాళ్ళు చేతులు మొలవగా పునర్జీవితుడైనాడు. కావ్యం మంగళాంతమైనది.




నూతన సాహితీమిత్ర పథకంలో
ఇప్పటికి **2,000** లకు పైగా
సహృదయులు సాహితీమిత్రులుగా చేరారు.

**10,000**

సాహితీ మిత్రులకు సన్నిహితం కావాలని
యువ భారతి ధ్యేయం!

సాహితీ మిత్రులు, భారతీ మిత్రులు, భారతీ భూషణులుగా చేరి
యువ భారతి సాహిత్యోద్యమ నిర్వహణలో తోడ్పడండి!



1975
లహరి






కవితాలహరికై ఎన్నికైన కవితామూర్తులు

- నాచన సోముడు
- పిల్లలమర్రి పినవీరభద్రుడు
- జాషువా
- దేవులపల్లి కృష్ణశాస్త్రి
- దాశరథి